# [illegible]

TELUGU POETRY

*BY*

S. KRISHNAMOORTHY SASTRI.

( *FIRST EDITION* )

Printed at the

Y. V. PRESS.

MARDAS:

**1898**



*Price* 0 8 0

శ్రీ

# తనకగిరి.

రాజమహేంద్రవరమునకు సమీపముననున్న

కాటవరమున నివసించియుండు,

శ్రీపాద - కృష్ణమూర్తిశాస్త్రిచే

రచియింపఁబడినది.

(మొదటికూర్పు)

చెన్నపురి.

శ్రీ యాజ్ఞవల్క్యముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1898



వెలరు 0-8-0.

శ్రీ

# అవతారిక.

కనకగిరి. ఇది యొకస్థలమహాత్త్వముం దెలుపు గ్రంథము. ఇందు నానావిధ ధర్మనీతులును, దేవతాభక్తిమహాత్వాదులును, గలిగి, కరుణాద్భుతరసప్రధానమగు చిత్రకథ పొదలుచున్నది. కనకగిరి యనునది యొకగ్రామంబును గ్రామంబును. విజయవాటికకుఁ బశ్చిమోత్తరముగాఁ బదియోజనముల దూరమందున్నది. నేనొకప్పుడటకుఁబోయినప్పుడు అచటి పెద్దలాస్థల ప్రభావమధికముగాఁ జెప్పిరి. నాకునువారు చెప్పినదంతయు నిజమనియేతోఁచినది.

2. ప్రస్తుతము. నేనీచెన్నపురికివచ్చియున్నప్పుడునాకవిత్వముసువిస్తినన్నుమన్నించినవారునుమదరాస్ప్రసిడెన్సికాలేజ్ సంస్కృతప్రొఫెసరులును, బెకుర్భాషలఁ జదువవ్రాయనేర్చినవారును, అగు బ్రహ్మశ్రీ. టి.యం. శేషగిరిశాస్త్రి. యం. యే. గారికి సంకేతముగా నాకపుస్తకము వ్రాసిననగుననితలంచి, మదరాస్ క్రిష్టియన్ కాలేజ్ సంస్కృతప్రధానపండితులును, ఆంధ్రభాషిజ్ఞాన శాకుంతలాదిమహాప్రబంధరచనాధురంధరులునగు బ్రహ్మశ్రీ వేదము-వేంకటరాయ శాస్త్రులవారికి విన్నవించినవారును "నీతలంపుకడుమంచిది. అట్లుచేయుము. కృతార్థుండవయ్యెదవు" అనిబోధించిరి.

3. నేనును ఆవిబుధులానందించునట్లు అపూర్వ గ్రంథ మేదిచేయుదునా యని ఆలోచించునంతలో నా కనకగిరి స్ఫురించె. శేషగిరికిఁగనకగిరితగునని స్థలపురాణములభింపకున్నను, తన్మహాత్మ్యమంతయు నే విన్నయదికాన, ఇట్లు గ్రంథరచనకునుపక్రమించి ముద్రింపించుచుంబూర్తి చేసినాఁడను. ఇదియెంత గ్రంథముగాముగియునో మొదటఁ దెలియకపోవుటం జేసి, ఆశ్వాసములుగా విభజించుటకు వీలుపడదయ్యె. స్వదేశప్రయాణవ్యగ్రాంతరంగుండనై గ్రంథమెట్లయినఁ బూర్తిమైనం జాలునని చివరభాగమొకవిధముగా క్లుప్తముచేసి వ్రాసినాఁడను.

4. మఱియు నక్కడక్కడ లోటుపాటు లుండిన నుండవచ్చును. అట్టికొఱతలన్నియు నింకొకసారి ముద్రించునపుడు సవరించుకొనఁగలను. ఇది యాశువుగావ్రాసిన గ్రంథమని చదువరులకుం దెలిపి నన్ను నవ్వింపక పోదు. ఒకటి రెండుసారులు చూఁచినను, అచ్చుతప్పులు పడియేయున్నవి. అందుకొన్నిమాత్రము శుద్ధపత్రమునంజూఁపబడియె. ఇందలిగుణాగుణము లరసజ్ఞులగు పండితులే ప్రమాణమని నేనేమియువ్రాయక యింతతోవిరమించుచున్నాఁడను.

చెన్నపురి.
1 - 4 - 98.

శ్రీపాద - కృష్ణమూర్తిశాస్త్రి.

# శుద్ధపత్రము.

| పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| ౩ | నీవు | నీవు |
| ౬ | నడచి | నడిచి |
| ౧౪ | చేతురు | చేసిరి |
| ,, | నిద్రహారమునుగిక | నిద్రభోజనమునుక |
| ౧౫ | జుండో | చుండో |
| ౧౭ | నడచు | నడుచు |
| ౧౮ | నడచు | నడుచు |
| ౧౯ | రఘుత్రవీరు | రఘుప్రవీరు |
| ౨౧ | కందుననకా | కందునకా |
| ,, | మఱియ | మఱియు |
| ౨౪ | స్పహా | స్పహ |
| ౨౫ | డా త్తిలక | డా గ్గుండా |
| ౨౭ | నడవు | నడుపు |
| ౨౯ | నాగ్ణింపుడు | నాకర్ణింపుడు |
| ౩౧ | నిండగా | నిండంగా |
| ౩౨ | సాంమ్రాజ్యం | సామ్రాజ్యం |
| ౩౩ | దంద్వంబై | ద్వంద్వంబై |
| ౩౪ | ఖాడం | ఖాండం |
| ,, | కౌంచము | కౌంచెము |
| ౩౫ | సంభారంబులు | సంభారంబు |
| ,, | ఋరావు | రాఋవ |
| ౩౭ | రషింపు | రక్షింపు |
| ౩౮ | గంధ | గంధ |
| ౩౯ | ముగ్దర | ముద్గర |
| ౪౦ | వీయాదా | వియదా |
| ౪౪ | మిగల | మిగుల |
| ౪౫ | దబ్బిబ్బ | దబ్బిబ్బు |
| ౪౬ | బ్రాణ | బ్రాణా |
| ౪౮ | ద్రొక్కుచు | ద్రొక్కుచు |
| ౫౧ | వర | పర |

# అంకితము.

శ్లో. శ్రీమజ్జైవాతృకాంచన్మణిమకుటరుచాపంచవర్ణానశేష
త్యక్షేష్వారంజితేషు త్రిభువనకలనాదక్షిణేషూత్తరేషు
బ్రహ్మాదీనాం ప్రసన్నే వరభుజదశకే మోదినీవేదమాతా
గాయత్రీశుభగాత్రీ దిశతుశుభతతిం శేషగిర్యగ్రిజాయ.

సీ. ఏసూరి వరుఁడుసంస్కృతమున మదరాసు
ప్రసిడెన్సికాలేజిప్రఫెసరయ్యె
నేకలానిధి సార్వలౌకికఖ్యాతిమై
మించియూన్వరిసెటిమెంబరయ్యె
నేమతిమంతుఁ డసామాన్యవైఖరి
యం-యే-పరీక్షఁగృతార్థుఁడయ్యె
నేకవి భాషలనెల్లనేరిచియాంధ్రి
శబ్దతత్త్వగ్రంథసరణిఁజేసె
సతఁడు వేంకటరమణయార్యాత్మజుండు
తాతవెళ్ళిముఠాదారుఁడాతతమతి
శేషగిరిశాస్త్రిధరనెప్డుఁజెలఁగుగాత
మాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి.

ఆద్రావిడభూదేవసార్వభౌములకు, సర్వభాషార్థరసగ్రహణదక్షులకు; నిజయశశ్చంద్రిక జగంబెగఁబ్రాకు బ్రహ్మశ్రీ. టి. యం. శేషగిరిశాస్త్రి. యం. యే. గారికి, అభ్యుదయ పరంపరాభి వృద్ధియగునట్లుగా నీకనకగిరి కృతజ్ఞతాపూర్వకభక్తి గౌరవంబున నంకితముచేయఁబడి సఫలీకరింపఁబడియె.

శ్రీ॥ కృ॥ శాస్త్రి.

TO

*SRI SRI SRI*

TATAVELLI MUTADAR

**SESHAGIRISASTRI AVARGHAL, M. A.**

PROFESSOR OF SANSKRIT AND COMPARATIVE PHILOLOGY, PRESIDENCY COLLEGE; CURATOR, GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY; MADRAS.

*THIS WORK*

*is*

MOST RESPECTFULLY DEDICATED

*BY*

*THE AUTHOR*

శ్రీ

# కనకగిరి.

క. శ్రీసవితృమండలాంతః। ర్వాసుండై జగములరసి రక్షించుమహో
ల్లాసునిసర్వేశుని నే। దోసిలిఘటియించిమ్రొక్కుదుంగడుభక్తిన్. ౧.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కనకగిరీశ్వర చరిత్రంబునకుం గథాక్రమంబెట్టిదనిన? శౌనకాదిమహర్షులకు రామహర్షణియిట్లని చెప్పందొడంగె. ౨.

మ. పుడమిన్ మున్ను రమాధవుండు రఘురాముండై జనింబొంది, పెం
పడరం గౌశిక యాగమున్మనిచి, సీతాబ్జాక్షిఁ జేపట్టి, కా
రడవిం గాంతను గోలుపోయి, హరిసఖ్యంబెంచి, సంద్రంబు నే
ర్పడ బంధించి, తలిర్ప వింటిరికదా! రామాయణంబంతయున్. ౩.

వ. ఆరామచంద్రుండు రావణాదిరక్షోగణంబుల రణంబునమరణంబునొందించి, హనుమత్సీతాలక్ష్మణ సుగ్రీవాంగద జాంబవద్విభీషణాదులతోఁ బుష్పకాధి రూఢుండై మరలివచ్చుచు, బ్రహ్మహత్యాఘ మర్షణార్థ మా సముద్రతీరంబునం దనపేరనొక్కశివలింగంబు ప్రతిష్ఠించి, సమయవత్సరంబులు పదునాలుగుం బరిపూర్తియయ్యెఁ గావుననయోధ్యాపురంబునకుంజనువాఁడై కదలినడుచుచు, నెడనెడ విడిదలనొక్కొక్క శివలింగంబునిలుపుచు, విజయవాటికడంగృష్ణానదిందాటి, యట కుఁగించిత్పశ్చిమోత్తరంబుగా నొకింతదూరంబుననున్న కల్లూరనునపర నామంబునంబొదలు కనకగిరిమీదుగాఁ జనుటయు నటఁబ్రయత్నంబుననైనం బుష్పకంబు గదలకుంటంగని రామచంద్రుం డాశ్చర్య మగ్నాంతరంగుండై సుగ్రీవాంగద జాంబవదాదులంజూచి యిట్లనియె. ౪.

# కనకగిరి.

చ. కను మెదలించు లోపల నఖండజవంబున నూరువేల యో
జనము లతిక్రమించుటకుఁ జాలినబల్గమనంబు గొన్న యీ
ఘనతర పుష్పకంబిచట గట్టిగమంత్రము సెప్పితిట్టిన
ట్లనయము మొద్దువోలె నడయాడుటమానె నిదేమిచిత్రమో? ౫.

ఉ. ఓకపిరాజ, యోహనుమ, యోనల, యోయువరాజ, యోగజా
యోకపిసేనలార, మఱలూడెనో? చీలలువీడెనో? సురా
నీకములాఁగెనో? దనుజనిర్మిత శాంబరియోగమింపకి
ట్లీకడనే మెలంగునిదియేమియొ? మీరలెఱింగి తెల్పుడీ?

చ. అనవుడుసూర్యపుత్రుఁ డదియంతయు నారసి కేలుమోడ్చియి
ట్లను రఘురాముతో నిది సురాసురమాయయుగాదు పుష్పకం
బునుఁ జెడదీప్రదేశమునఁ బొల్చు మహామహిమంబుదాఁటి పోఁ
గనుఁ బ్రతికూలముం గలుగఁగా నొనరించెఁ జుమీ! రఘూద్వహా. ౭.

క. నావుడురఘురాముఁడు సు। గ్రీవా, స్థలమహిమమాఁగెఁ గీర్తితగతి నం
శేవంవిధమిట నెట్లగు। నీవెఱిఁగితివి దానినికఱము చెప్పుమా. ౮.

తే. అనుడు సుగ్రీవుఁడిట్లను నయ్య, నేను
మున్ను మాయన్న యావడి కెన్నిగతుల
నోర్వలేక యూడనిఁ బాడు చున్నవేళఁ
బుడమి యంతయుఁ జూచితి జడధు లెల్ల. ౯.

వ. ఆసమయంబున నీపురంబు నాసేత్రపర్వం బొనరించెఁ బాలసుండ
గు వాలికిం జొరరామి నే నిందు వెరపుడిగి కొన్ని వారంబు లుండి,
యశేషవిశేషంబు లెఱింగితి, దేవర యెఱుంగని యర్థంబింతయును
లేదైన నేను మన్నింపఁ బడితిఁ గావున విన్నవించెద సావధాన
మనస్కుండవై యాకర్ణింపుము. ౧౦.

గీ. కనక ఖను లిందుఁ గలిగిన కారణమునఁ
గనక గిరి యనునామ మీ గ్రామమునకుఁ
గలిగె నిచ్చెంతన తలిర్చు కతననీవు
రమ్మలరుఁ గనక గిరి పురమ్మనంగ. ౧౧.

తే. ఉష్ణ కిరణుని బండికల్లొకటిఁ దూడి
యుర్విఁ బడుటయుఁ జూచి యి య్యూరి వారు
భక్తిఁ గొని తెచ్చి తమ యూర భద్రపఱుప
నొనరెఁగల్లూరనంగ నీయూరి పేరు. ౧౨.

వ. అని చెప్పి సుగ్రీవుం డంతరిక్షంబునందుండి రామున కా పుర విశే
షంబు లెల్ల నంగుళీ సంజ్ఞం జూపుచు వెండియునిట్లనియె. ౧౩.

మ. అదె కన్గొంటివె? సూత్ర పట్టి నటులన్ హర్మ్యంబు బల్విధులుం
దుదలన్ మింటిని తాయు మేడలు వనస్తోమంబులుం జెఱ్వులుం
బొదలన్ స్వర్గ పురంబు వోలెఁ గనుగో మోదంబు సంధించెడుం
గద క్రిందైన జన కోటితోఁ బురమహో! కల్లూరునాఁ జేరిటన్. ౧౪.

మ. ఇదిగో! చూడుము వీఁట నాలయము లక్ష్మీశా, దివం బంటు నిం
దు దయన్ రాధయు రుక్మిణీ రమణియుం దోడ్తోడ సేవింప నె
మ్మది గోపాలుఁడు పొల్చి, యూరిప్రజలన్ మన్నించి, రక్షించి, పెం
పొదవం జేయుచునున్నవాఁడుసుమి సర్వోత్కృష్టుఁడై యిష్టుఁడై. ౧౫.

ఉ. అల్లదెకంటివే? కనకమన్గిరి పాదములన్ రసాతలం
బల్లనమెట్టుచున్ దివము నాఁగుచుఁగూటములన్ విశాలమై
యల్లసుమేరుశైల మిసుమంతయు నాపురుడందదంచు లో
నుల్లసమాడుచున్న దననొప్పెడు నెంతయునున్నిజోన్నతిన్. ౧౬.

ఉ. పచ్చని డాలునన్ మిగులఁ బండినమావుల నొప్పనల్లడల్
హెచ్చగు శీర్షమందుఁదగ లేవడి లేకతసీద్రుమంబులున్

ముచ్చటసేయ వక్రుఁడుపుగఁ బొల్చెడునిగ్గిరి మేచకాగ్రముల్
నిచ్చలుఁ బూయుటంబసపునిగ్గులఁదేలునిలా కుచంబునాఁ. ౧౭.

సీ. అదిగొ పర్వతమున నలరారునొకబావి కనుగొన్నఁగన్నుల కఱవుదీర
నదెపల్లెములబావి యననొప్పుఁగాశిగం గనువిడుపల్లెముల్గలుగుకతన
భాగీరథీవారి పాఱిభూమ్యంతర ముననుండి వచ్చి యిందునఁదలిర్చు
నిస్నీళ్ళునెలనాళ్ళు లెవ్వరేఁద్రావిన సర్వజ్వరంబులు సమసిపోవు

బిడ్డయొక్కఁడు పుట్టమి గొడ్డు తనము
చెంది యుండిన జంపతు లిందు నీరు
మండలము గ్రోలిరేని భూమండలమున
బిడ్డఁగనిరెద రేటిలో దొడ్డగాను. ౧౮.

క. అరిదిగి నటికిన నతికాదు। తరువులు లత లీనగంబు తలపై నలరుఁ
బరికించిచూడ దీనికిఁ। బురుడగు పర్వతము లేదు భువిలో మహిమన్.

మ. ఇనవంశాంబుధి పూర్ణచంద్ర,యిదె నాయీ గ్రేలు చూచాయఁగ
న్గొనుమీ! దేవళ మొందు చూడఁదనరున్ గోవిందుఁడల్లప్పుడ
క్కనకాహ్వాగ్రజుఁజంపి భక్తుల దయంగావంగ నిప్పట్టునం
దనరున్వేల్పులు మౌనులుం గమలయున్ బ్రహ్మాదులుం గొల్వఁగన్.

చ. కనకగిరీంద్రమందు ననుఁగన్నులకుం గల కట్టు దీర్చుచుం
గనకమయాలయంబున నఖండతపోనిధులున్ సురాసురుల్
ఘనమగు భక్తిమైఁ గొలువఁగాఁ గమలా కమలాయతాక్షితోఁ
గనకమయస్వరూపుఁడయి క్రాలెడు లోకము లేలువేడుకన్. ౨౧.

చ. కలిత చరాచరాత్మక జగత్త్రయ పాలన తత్పరాత్ముఁడై
కొలువఁగ దేవవారము లకుంఠిత భక్తిని నెక్కువచ్చి తన్
గొలువఁగ లేకయున్న జనకోటికి సంతత సౌఖ్యమిచ్చుచున్
వెలుఁగు నృసింహమూర్తి తనవేడుక దిక్కుల నెల్లనించుచున్. ౨౨.

చ. ఇతనిమహాప్రసాదమున నిప్పురమందున నున్నవారు సం
తతపరమార్థబోధకు, లుదారయశస్కులు, ధర్మతత్పరుల్
వితతసునీతికోవిదులు, వీతతమఃపదు, లుత్తమోత్తముల్,
చతురులు, సంపదంచితులు, సాధుచరిత్రులు, నైరి రాఘవా! ౨౩.

క. ఏయేధర్మములందున । నేయేవర్ణములవార లెట్లుండనగున్
ఆ యాధర్మము లందునఁ । నాయావర్ణములవార లట్లుండురిటన్

క. కలనైనఁ జెడుగుత్రోవల । కెలనం జనకోరులకెపుడుఁ గీడగుపనులన్
దలఁపక నుండుటనిప్పురి । గల లోకులు గొదలులేక కడఁగుదురధిపా!

క. పాఁడియుఁబంటయు సిరియును । వీఁడుమనక వీఁడనట్లు వెకలిసమగున్
వీఁడునఁబ్రజలకు నెపుడున్ । వాఁడిగలది సత్పవిత్రవర్తనముఁగద! దేవా!

గీ. కూటసాక్ష్యములిచ్చుచుఁ గులసతులనుఁ
బట్టిఱచుచు బాటలఁ గొట్టికొనుచు
జూదమాడుచుఁ గలుఁద్రావుచును మెలంగు
చెడుగు లిప్పుడు నప్పుడు జెడుటనిజము. ౨౬.

క. తనదారిఁ దానుఁ బోవుచు । జనులకు నోపినకొలంది సాయమొసర్పం
దనరుచుఁ దగునడవడికల । జనుసజ్జనుఁడిందునందు సౌఖ్యముజెందున్

క. అని యప్పుర మహిమంబును
ఘనతరముగ సూర్యసూతి కడు వినయమునన్
వినుపింప రామచంద్రుఁడు
విని మనమున సంతసించి వెండియునసియెన్. ౨౯

ఉ. ఇట్టిమహాస్థలంబునుఁబరీక్షు యొనర్చినఁ బాప జాలముల్
గట్టిగ నాశనంబగునుఁ గావున నిందఱ మొందు రెందునా
శ్చెట్టన కుండి పో వలయు నిప్పురి నంచని యాన వెట్టి తా
గట్టునఁ బుష్పకంబు డిగెఁగౌతుక మూర సమస్తసేనతోన్. ౩౦

# కనకగిరి.

వ. ఇట్లు కనకగిరిమూర్ధంబున సపరివారుండై విమానావరోహణం బొనరించి, యెల్లవారల నట నుండనియమించి, రామచంద్రుండు సీతాలక్ష్మణసహితుండై నరసింహాలయమునకుం జని, నారసింహుని షోడశోపచారంబులం బూజించి ప్రత్యక్షంబు గావించుకొని, సంభాషించి, యుభయు లేకీభావంబునొంది సెలవుగొని, మఱల సేనలం గలసి,నడచి, పురప్రవేశంబుగావించి, రాజమార్గంబునం జనునప్పు డప్పురాంగనామణులు స్వాంతరంగంబుల సీతారామలక్ష్మణదర్శనలాలసలై రాజసదనోపరిగత జాలకంబులనావరించి రట్టిసమయంబున. ౩౧.

చ. ఇనకులవార్ధిచంద్రుని సమీక్షణ సేయుతలంపు పెంపునం
దనరిన వీటిచేడియలు దారు సుధామయసౌధవీథులన్
ఘనతరజాలకంబులనుఁ గ్రమముఖంబులు సేర్చియున్నెడం
గనఁదగె స్వర్ధునిం గనకకంజము లెల్లెడ నుల్లసిల్లునాన్. ౩౨.

ఉ. తనచెలులెల్ల రాముఁ గనఁ దారిరటం చతిసంభ్రమంబునన్
వనిత యొకర్తు పాదముల వ్రాయుచు లత్తుక సప్పుగేలు గ
ట్టినవసనంబునం దుడిచి శీవిమెయిం జనుఁ జేర నెచ్చెలుల్
గని కదియంగ రా కనుచుఁ గైకస గొట్టిరి రాగ మొప్పటన్. ౩౩.

చ. అలివ యొకర్తు దిద్దుకొన నాయితమయ్యెను నంతలో రమా
పతిచను దెంచెనంచు విని వైభవమారయు తత్తరంబులో
నలికినఁ దారుమారుపడ నాభరణంబులు మేనఁదాల్చి యు
న్నత నిజసౌధమెక్కెఁ గని నాతులు చేతులుదట్టఁ బెట్టుగన్. ౩౪.

చ. వడిగ గవాక్ష కేగునొకవారిజలోచన కొప్పు వీడి మే
నడరఁగఁ గప్పిన న్మృదువనైనఁ దలంపక పోఁగఁ బెన్నెరుల్
జడదను, మేనితళుకు చపలల్విడి తాలెడు పూలుచిన్కులం
చడుగునఁ జూచువారలకు నాసమయంబునఁ దోఁచె నంతయున్. ౩౫.

చ. చనియెడు రాముఁడంచు విని చాన యొకర్తు పిఱిందు బోయియుం
జనుఁగవ గొప్పను స్నగలు చాలభరంబగుటన్ జడత్వమొం
దినదడ సౌధమెక్కుటకు నేరనిచో మది యూఁతఁజేసి,తో
డ్తొనిని చని, చూపి తాను వడిఁదొల్లిపడెం బయినుండి శౌరిపైన్. 3౧.

వ. ఆసమయంబునం గొందఱు పురంధ్రీరత్నంబులు దమలోఁ దారుఁ బ్రసంగించుచు రామచంద్రునింజూచి యిట్లనిరి. 32.

సీ. ఇతఁడఁటే! జగమెల్ల నెసగింపఁ గౌసల్యకడుపుచల్లఁగఁ గన్నకొడుకుకుఱ్ఱ
యితఁడఁటే! సోకుల నెదిరించి జడదారి యజ్ఞంబుఁ గాచిన యట్టిబిరుదు
ఇతఁడఁటే! వేనవేలెత్తఁగ లేని యీశ్వరుని విల్విఱిచినబల్లిదుండు
ఇతఁడఁటే! శబరిదానిడిన యెంగిలిసూఁడిదని ప్రీతితోడ మెక్కినదయాళుఁ
డితఁడఁటే! వారినిధిఁ గట్టి యెసఁగువాఁడు
ఇతఁడఁటే! రావణునిఁ జావ నేసినాఁడు
ఇతఁడఁటే! విభీషణుఁ గాచి యేలినాఁడు
ఇతఁడఁటే! జగమేలు లక్ష్మీశ్వరుండు. 3౩.

చ. కొడుకులు లేమి మిక్కిలిగఁ గొందలమందుచు నా యయోధ్యనా
థుడు గురునాజ్ఞ నధ్వరముఁ దోరఁపుభక్తి నొనర్చెఁ బావకుం
డిడె వరపాయసం బది గ్రహించెనుఁ గోసలరాజపుత్రి య
ప్పడతికిఁ బుట్టె నీపసపం డిది నోముఫలంబు గంటిరే! 3౪.

క. చెలులార, వింటిరే! యీ కులరత్నము గాధిపట్టి కోరినఁ జన్న,చి
కులఁ బెట్టు తాటకాదులఁ దోలి వేల్పులగిట్టి సవముఁ దొడరించెఁ జూడీ.

మ. ఇతఁడా కాన శిలాస్వరూపమునఁ దా నెంతే గొదంబడ్డ యా
సతిని గౌతమునాతి నింద్రుకతనన్ శాపంబు గొన్నట్టి స
న్నుతచారిత్ర నిజాంఘ్రిరేణువులచే నూత్నాంగనంజేసి యు
న్నతి నాథుం గలయంగఁ జూచె మరలన్ రాముండితండల్లఁడే. ౩౬.

తే. సానుజుఁడితండు గాధేయమౌనివెంట
మిథిల కఱుదెంచి సీతకై ప్రథితమైన
యీశుచాపము వేగుఱు నెత్తరాని
దానినవలీల విఱిచె నాలోన బళిరె. ౪౧.

ఆ. తనదు భాగ్యమనుచు జనకుఁడీ బంగారు
కాళ్ళు గడిగి యిచ్చెఁ గన్నె దాన
మితఁడు దగఁ బరిగ్రహించి పెండ్లాడెఁ జూ!
సంతసమున నుర్విజాత సీత. ౪౨.

క. భార్గవరాముని మధ్యే! మార్గమునన్ గర్వమడఁచి మహిమోన్నతిచే
దుర్గమునకనిచెనితఁడు! నర్గళశౌర్యాతిధైర్య నయకోవిదుఁడై. ౪౩.

ఉ. కానక కన్నకందనక కానలనుండఁగఁ బంపుమన్న దు
ర్మానిని కేకయాత్మజకు మారువచింపఁగ లేక వట్టి య
జ్ఞానుఁడు వోలె నా జనకుశాసనమాఁదలఁ దాల్చి పాప మ
మ్మా! నలువేది మెట్టె వనులందితఁడాలియుఁదమ్ముఁడంటిరాఁక్. ౪౪

తే. వనుల మునులనుఁ గరుణించి, చనువునిచ్చి,
మొండి ఖరదూషణాదుల గండడంచి,
రక్కసులమాయలోఁ జిక్కి, యొకరుకోన
సీతఁగోల్పోయి యీతఁడు చెదరెనకట! ౪౫.

క. తనకైపడినజటాయువుఁ!గనికరమునఁగరమునందుఁగదియించి,చితా
-గ్నినివెలుఁగఁజేసిస్వర్గముఁ!గొనఁజేసెనటమ్మ!యితఁడుకోమలులారా.

శా. వాలింగూలిచి యొక్కకోల, రవిజుం బట్టాభిషేకంబు స
ల్లీలం బొందఁగఁజేసి, వానరులతో లేఖాధినాథార్థితుం
డై లంకాపురి ముట్టడించి, సమరం బందాదిదేవాళినిం
గాలుం గొల్వఁగఁబుచ్చెనీతఁడు రమాకాంతుండు నిక్కంబుగన్. ౪౭.

క. దూరము నూఱామడగల। వారిధి నేరీతిఁ గట్టి వానరసేనా
వారయుతుండై సోకుల। నేరీతి వధించెనమ్మ! యితఁడమ్మ కారా! ౪౮

క. మాయా రావణువలన। న్మాయమెయిందూలిపోయి మహిమోన్నతిచే
నాయెడలమఱలఁబురికొని। యాయధమునిఁ గూల్చెనంట! యదివింటిరటే.

చ. అనల పరీక్షితన్ జనకునాత్మజ సీతఁ బరిగ్రహించి, లం
కనుఁదయచేసి భక్తునకుఁ, గ్రన్ననఁబుష్పకమెక్కి పోవుచున్
మనల ననుగ్రహింప నిటుమానుగ వచ్చినవాఁడయోధ్యకీ
యనదారనైయె కుమారుల నయంబునఁ గాంచి వెలుంగుగావుతన్. ౫౦.

ఉ. తగదన కాలిమాయఁబడి తండ్రి వెడంగయి పల్కె నంతనే
నగలు దొలంగఁ ద్రోచుకొని, నారలుగట్టి, శ్రమంబు సైఁచి, మె
ట్టఁగఁజనె రాసుతుండితఁడట వ్యయనంబుల నెట్టివారికిన్
జగమున నెట్టిదైనఁ బితృశాసనమూనుట ధర్మమేకదా. ౫౧.

ఉ. అల్ల మహీంద్రపుత్రులకు నందఱకగ్రజుఁడయ్యు, నన్నిటం
జెల్లినవాఁడునయ్యు, వరశీలుఁడు రాముఁడితండు బాపురే!
తల్లియుఁ దండ్రియుందనకు దైవములంచని, వారిమీరఁగా
నొల్లక కానకేఁగె నిటులుండఁదగుం గొడుకన్న వాఁడిలన్. ౫౨.

సీ. హరిహరాది సురాళినర్చించుకంటె నత్యధికమా మాతృపిత్రర్చనంబు
గంగాదితీర్థావగాహనంబునకంటె నధికమా మాతృపిత్రర్చనంబు
పౌండరీకాది సవనకాండకృతికంటె నధికమా మాతృపిత్రర్చనంబు
సప్తసంతాన ప్రశస్తనిష్కృతికంటె నధికమా మాతృపిత్రర్చనంబు
వటుకజటి పరివ్రాజకాపాలికాద్య
నాథకోటుల కవిరతాన్నప్రదాన
మిడి భజించుట కంటెనుఁ గొడుకులకును
నరయనధికమా మాతృపిత్రర్చనంబు. ౫౩.

క. ధాత్రిఁ బిత్రూణముఁ దీర్పని । పుత్రుండా కపుత్రుఁడగునె మూఢుఁడతండే
శత్రువగు బుణము దీర్చిన । పుత్రుఁడె పుత్రుండు జుండి బుద్ధిఁ దెలియన్. ౫౪

క. కొడుకులు జననీజనకుల । నుడువుల నిట్లుండనగుననుచు నెల్లఱకుం
దెలుపుటకుఁగా దె వనులకు । వెడలె నితండితనిఁ బొగడవే యెండ్లైనగున్.

మ. వనజాక్షుండితఁడంచు నెంచక వనిన్ వాసంబునుం బొందఁబు
చ్చిన నా కైకేయినిఁ దల్లినాఁక కడునిస్సీ! యంచునోనాఁడి, తా
ననుఁగుందమ్ములఁ దమ్ము బిడ్డలవలెన్ హర్షంబునంజూచుఁగా
వున నే రాముఁడు లేమి నాభరతుఁడా భూరాజ్యమొల్లం డెదన్. ౫౬.

తే. భాతృసౌజన్య మనఁగ నీవంగడమున
నే! కుదరె భరతుఁడు రాజ్యమెడసి రాము
పాదుకలఁ గొల్చుచుండె, సర్వంబువిడిచి
వెంటఁజను దెంచె సౌమిత్రి విపినములకును. ౫౭.

క. పాటించి మనోహరుని । మ్మేటినిఁగని మరులుగొని తమిం గోరినయా
బూటకపు నిశాటినిగడు । పాటొందెనుఁ బాపమట్లు ఫలియింపనగున్. ౫౮.

చ. మగఁడు కురూపియైన నసమానుఁడు హీనుఁడునైనఁ గాంతలి
జ్జగమున దైవ మాతఁడని సన్మతిఁ గొల్చుచునున్నఁ గీర్తిమైఁ
దగి యెడరట్లుకాక పెడదారులు ద్రొక్కటఁ గఁబోయి రేనిఁద
ప్పుగఁ జనుచుప్పనాతిబలెఁ బొల్పరి పోవకకుందకుందురే? ౫౯.

చ. పురుషుల సత్యమార్గమునఁ బోవక సత్యముఁ దప్పకుండినం
బరతరుణీ ప్రసంగమునుఁ బట్టక స్వాంగనఁ బాయకుండినన్
బరగుదురుత్తమోత్తములునా నదిగావున సర్వవేదిభా
స్కరకులుఁడగ్ని సాక్షికముగాఁ గొను సీతనుఁ బాసియుండునే? ౬౦.

క. పరసతులఁ జెఱలఁ బెట్టిన । దురితాత్ముఁడు రావణుండు ద్రుంగుటయు నెదం
బరసతుల మాతృభావనఁ । బరికించు విభీషణుండు పరగుటవినమే? ౬౧.

క. పుడమిసుతనీరఘూద్వహుఁ। డడవులలో నిడుమగుడువనటి గెడునపుడే
నెడబాయఁడ పడఁతులకి। ట్టిఁ ప్రాణేశ్వరుఁడుదొరకుటే! భాగ్యముగా.

వ. అంత మఱియుం గొందఱు కామినులా రామునిసౌందర్యంబుఁ జూచి
తమలోనః-   ౬౩.

చ. పరిమళ మొల్కుచుండు తెగబారెడు నల్లనిసోఁగ వెండ్రుక
ల్వరుసలు దీరుతేటి పరిఁబమ్మెరవోవఁగఁబారద్రోలు, బం
గరుజిగి నెమ్మొగంబు నెలఁగొ్రలెడు వెన్నెలతేని దూరుజి
త్వరమయి, చేరలంగొలువవచ్చునొ? హెచ్చునొ? వీని నేత్రముల్. ౬౪.

మత్త. కొండపిల్లలువీని మూపులు, కోటతల్పు వెడందమై
యుండువక్షము, బాహుయుగ్మ మయోమయార్గళమై మహో
ద్దండసంగర శత్రుసాధ్వస దంబులై కనుపట్టినన్
నిండుగాఁ గుతుకంబ కూర్చెడు నీలవేణులకెత్తఱిన్.   ౬౫.

క. ఘనమని చెప్పఁగనగునీ। తనిపెను నునుసోగనెఱులు ధరఁగాదనినన్
మననెమ్మది నెమ్ములుగనుఁ। గొనినంతన కుతుకమంది కొలుచుటలేలా?

చ. మొగమల చందురుంగఱఁగి పోసి విధాత రచించె నంచుముం
దగిలి కవీశ్వరుల్ నుడువదబ్బర యంచనుకొంటిమమ్మ! కా
దగునెల వీనిమోముఁ గనినంతనహా? మనకన్నుగల్వలిం
పుగవికసించెడు న్నిజము బొంకరయంగద! తేటతెల్లమా.   ౬౬.

ఉ. పూవిలు కానివిండ్లు నడి పోలిచి చూడఁగవీని కన్బొమ
ల్గావున దృష్టిబాణములు గాటముగా మనమీఁద వ్రాలి హృ
ద్గ్రావముల స్విభిన్నములుగానొనరింప వికారమొందిమై
చేవదొఱంగి యుండితిమి చేష్టలుదక్కి మనోజుధాటిమై.   ౬౭.

తే. కన్నుగవయును, మీగాళ్ళు, కాన్మొదలగు
నవయవంబులఁ జూచినయంత నితఁడు

మత్స్య, కూర్మ, నృసింహాది మాన్యరూప
ములఁజెలంగె మున్నని తోఁచు ముగుదలార. ౧౯.

తే. సుందరాంగు డీతనిఁగొలువందఁ గలుగు
భాగ్యమది యెన్నఁడేని నీపడఁతులకును
లభ్యమగునే మొకో! చెలులార, తలఁపుఁ
డది జలములఁబొల్చి తపించు నామక సుఁడి. ౨౦.

చ. ఇతనిఁగవుంగిలించుకొని, యేకశరీరము వోలెనుండిసాం
ప్రతము సుఖించుచుంటకు నిరంతరమే జలదుర్గమందునన్
స్థితిఁ గొని, శంకరుం గొలిచి, నిష్ఠమెయిన్ మునులెల్లమెచ్చనీ
పతిహిత వృత్త సీత తొలిబాముననెంతతపంబు చేసెనో ౨౧.

వ. అనుచుఁ బువ్వునకుఁ దావియుంబోలె నవినాభావ సంబధంబున రా
మునంటివచ్చు జానకి నుద్దేశించి.– ౨౨.

సీ. గడియపూఁదోఁటలో నడయాడలేదీ మెయడవిఁబెక్కేండ్లెట్లు నడిచెనమ్మ
ననదాకి కందెనంచను మృదులాంగి నారలుగట్టనేరీతిఁ దలకదమ్మ
చెలులతో మాటాడనలసెడునబలరక్క-సితాపులకునెట్లు కలఁగదమ్మ
జనకుని కేసమక్షమున నుత్తరమీనియది సోకునెటు దూరనాఁడెనమ్మ.

కట! కటా! లోకముల నేలఁగలిగినట్టి
యిట్టివారికిఁ బ్రారబ్ధ మెట్టులైన
ననుభవింపక పోదన్న నస్మదాది
హీనజనులనుఁ జెప్పంగ నేటికమ్మ. ౨౩.

ఉత్సాహ. ఎండకన్నువానకన్ను నెఱుఁగవీవు జనకభూ
మండలేశపుత్రి, రాకపూను ముందుమింటనా
నుండ దేవ, నిన్ను విడిచి యొక్క- గడియ యేనినీ
యుఁడ స్వర్గమనుచు వనములందుఁ దిటిగనీమ హా! ౨౪.

క. హృదయేశుఁడు ముదమందఁగ
ముదమందెడు నదియుఁ బొక్కఁ(బొక్కెడు నదియున్
జిదిసినఁజిదిసెడు నదియా
సుదతిగదా ! సాధ్వియనఁగఁజొప్పడునుర్విన్. ౨౫.

ఆ. ఇంటనున్ననాళ్ళకంటె వేమడుఁగులా। యడవిపతినివిడకనడుచునపుడు
సుఖమయనుభవించెసుదతియీజానకి । పట్లకాదెమగనియండసతికి.

క. తననుడి జవదాఁటదుగా। పునసీసతి మాయలేడి పోఁడిమిఁగనితె
మ్మనినంతరాముఁ డిడికా। దనకేఁగెంబట్టియీఁగ నదినెనరుగదా! ౨౬

సీ. హాలక్ష్మణా!యనునార్తస్వరమువిన్నయప్పుడీయమయెంతయడలెనొక్కో
దశకంఠుఁడులు దెంచి తనుఁగొనిపోవుచో నీయపభీతినెంతేడ్చెనొకొ?
మఱఁదినాడినతనమాటలుదలచియీయమగుపదుష్కృతికెంతవగచెనొక్కో
రక్కసదళములయిక్కట్లఁబడుచు నీక్షితిసుత యెంతదుఃఖించెనొక్కో?
ఒకనెలలోన నీవునాపకుఁజేర। వేనినాచేతనీకు నీవెఱిఁగియుండు
మనెడురావణువాపులకడలియీప। డెందమందెంతసంతాపమందెనొక్కో?

చ. వినఁగనజాతిగుండియలప్రీల్చెడు దేశముగాని దేశమం
దునజముబంట్లఁబోని పతితుల్, ప్రతిబంధము బాధ,మాఱుది
క్కునునదిసున్న, యొకరీత, నైన,సురేంద్రవిరోధిఁజేటికిం
గొనకపతివ్రతాత్వముఁగొప్పగఁగైకొను సీమవింటిరే. ౨౮.

తే. అట్టినిర్బంధములనుండి యైననింత। గరితతనమునువిడదన్నకతనసీమె
యధికురాలరుంధతికన్ననత్రిపత్ని। కన్నసావిత్రికన్ననహల్యకన్న. ౨౯.

చ. మునులకు సందియంబులనుఁ బోకడఁబెట్టెడు నట్టిజ్ఞానియా
జనకునియజ్ఞవాటమున జన్మమునొందిన యీమ యిట్టిమే
ల్గొనములనొప్పునంచనుట లోకజనశ్రుత మాను వజ్రపుం
గనులనువజ్రమే చెలఁగుఁగాని చెలంగునె గాజులా, యహా! ౩౦.

తే. మంచిగుణములవారికి మంచివారు
చెడ్డగుణములవారికిఁ జెడ్డవారు
కోరకయపుట్టిపొల్తు రేగూటిచిలుక
యాపలుక పల్కనునుమాట లవనివినమె. ౪౧.

చ. చిఱుతతనంబునందయినఁ జెడ్డయుమంచియు వీడఁద్రోయనే
వెఱవరిమైనఁజాలఁడని వేయుఁదెఱంగుల నెల్లవారునె
త్తఱి నెఱిఁగింత్రుగానఁ దలిదండ్రులు బిడ్డలకూహవచ్చుచో
నెఱిఁగలిగించుమార్గములు నేర్పనిచోఁ జెడిపోదురవ్వలన్. ౪౨.

క. మగవారువిద్యనేర్వఁగ। నగుమగువలుదగరుచెడుగు లగుదు రటంచున్
జగడముచేతురుకొందఱు। తగదీసతిచదివెఁగానఁదఱిఁగెంగొదలన్. ౪౩

సీ. అనిశంబునాయవ్యయాదుల గృహకృత్యములయందు మెలఁకువ మెలఁగ (వచ్చు
నడవడికలజ్ఞాన మడరబిడ్డలకును తేటనీతులను బోధింపవచ్చు
ధర్మంబులెఱిఁగిభర్తనుఁగొల్చితదనుగ్రహముఁబొందిసుఖముగానలర (వచ్చు
సకలపురాణార్థసారంబు చక్కఁగాఁదెలిసి మోక్షంబు సాధింపవచ్చు
నిచ్చలుబుసుపోక గచ్చకాయలుగవ్వ। లాడకలరుకథల నరసిచదివి
యిందునందుసుఖముఁబొందఁగవచ్చును। నెలఁతలోకరువిద్య నేర్చిరేని.

ఉ. ఆరసివిద్యలన్ విదుషియైనదిగావునఁ దన్నుమ్రింగఁగాఁ
జేరిన రాక్షసాంగనలచేష్టలు సైచి, సునీతిధర్మముల్
వారలకెల్లబోధన మవారిగఁజేయుచుఁజేరి, దాసులై
వారలుదాస్యమున్సలుప భాసిలెసీయమ తెల్విపెంపునన్. ౪౪.

వ. అనంతరంబలక్ష్మణుంజూచి.- ౪౫.

మ. పదునాల్గేడులు నిద్రహారమునొగిన్ వర్జించి, తానన్ననున్
వదినంగొల్చుచువచ్చి, కారడవిలో వాసంబుగావించి, యా

పదతెన్నెఁబడి, యింద్రునోర్చుదనుజుఁ వాలమ్మునంగూల్చి, పెం
పొదవంబోల్చెడు లక్ష్మణుండితఁడజుండో కాంతలారా! కనఁ. ౮౭.

ఉ. అకటాట పఙ్క్తికంధరుని యావడిఁద్రెళ్లెడు నీవిభీషణుఁ
మికిలి వేడ్కఁగాచుటకు మీదుగరానలసోకు శక్తిమె
నుక్కటి ప్రాణముల్విడిచియు న్మరలందన తొంటినోముఁ
జక్కనిమందుసన్ బ్రతికెసంగర మందితఁడమ్మ చెల్లరే. ౮౮.

తే. వీనిసాభ్రాత్ర మెట్టిదో కానిభక్తి
తల్లిదండ్రులనాలినిఁ దమ్మునివిడి
వదిననన్నను గొలుచువచ్చె వనికి
నెట్లెఁగబోమున్న పితృసమో జ్యేష్ఠయనుట. ౮౯.

క. కంటికి ఱెప్ప తెఱంగున। గంటికి ఱెప్పను మఱంగఁగానీకిచ్చుఁ
వెంటఁజనియన్నఁగొల్చెను। గంటిరె? పదునాలుగేండ్లుగావితఁడాహా!

క. తల్లియని తండ్రియనుచుం। దెల్లముగాఁ దెలిసి రామునిన్సీతాయిఁ
ముల్లోకములెఱుఁగనితం। డల్లనగురుభక్తిఁగొలిచెనమ్మక చెల్లా! ౯౧.

వ. అనిసీతారామ లక్ష్మణులంగొలిచినడుచున్నయాంజనేయుంజూచి.—

సీ. పుట్టినప్పుడయినుఁ బట్టిమింగఁగఁబోయెఁగడిమినీకపిరాజు కాంతలార
మున్నీరు గోష్పదంబుగనొక్కయంజమైదాటెనీమారుతిబోటులార
యక్షాది దనుజాళినక్షీణ బలమున శిక్షించె నీహరి చెలియలార
సీతాంగనావార్తచెప్పి శ్రీరామునినెగడించె నీగుణినెలతలార.

సమరమున రావణాసురు శక్తివలనఁ
బొలియనున్నట్టి లక్ష్మణమూర్తినితఁడు
ధైర్యమలర సంజీవనిధరవరంబు
దెచ్చి బ్రతికించెనమ్మరో తెఱవలార. ౯౨.

ఉ. అర్థులకర్థముఖ్య వివిధార్థములోసిన భంగిఁజేయకీ
వ్యర్థముగాఁగఁ బోఁదలఁచివర్థిలు చుండెడుమేనుఁబెంచినన్
సార్థక మేమి? దేహి పరమార్థముఁ జూడవలెంబరోపకా
రార్థమిదం శరీరమను నానుడికర్థమితండెటింగెఁజూ ౯౪

మ. కలిమిందూఁగెడు నప్డువేగు, రదివోఁగన్పట్టఁ డొక్కండు,నీ
లలితాంతః కరణుండు సూర్యసుతునిఁ లక్షించిపాయండుకొం
దలముం జెందిగ తార్థుఁడైన, 'హరితోదాసఖ్యముం గూర్చివ
ర్థిలఁగావించె' నమాత్యుఁడై,భటుఁడునై, దేవుండునై,చుట్టమై. ౯౫

క. ఇతఁడింతటి నమ్మకముఁ। బ్రతిభయునుం గార్యసాధ నత్వంబు సమ
ర్థతయుఁగ లాఁడనికాదే। క్షితికన్యకునుంగ్రమంపె శ్రీరాముఁడహా।

మ. ఉదధిందాటఁగ నోపమేమనియ వీర్యోక్తుల్ ప్రశంసింపనం
గదముఖ్యుల్, 'తనమేను రామునకునై గాసిల్లినంగానియొ
ప్పిదముంచున్నవహ యోజనాంబరగతిస్స్వీక్షింపకియ్యాంజనే
యదయాచుమూర్తివిశాలకీర్తిగడఁగెఁ హాహామహాకార్యముఁ. ౯౬.

సీ. ఉదధి మధ్యమునందు నొదవిన గొదలెల్లఁగోరాడి పారముఁజేరినాఁడు
లంకఁజేరఁగ నీఁకయుంకించి యెదిరినకూళలంకను లీలగూల్చినాఁడు
కడుప్రయాసమునొందిపుడమికన్నియజూచియెఱుకకైయుంగరమిచ్చి(నాఁడు
అక్షిణజవమున నక్షాదులనుఁగూల్చి చేరిరాక్షస రాజుదూరినాఁడు
వడిగఁజూచి రమ్మనఁ గాల్చివచ్చినాఁడు
మెచ్చరాముఁడు సతివార్తఁ దెచ్చినాఁడు
వసుధఁబర మోపకారస్వభావుఁడితఁడె
యితని వర్ణించుటకుఁ జాలరెవ్వరైన. ౯౭.

క॥ ఎచ్చటనో దవ్వులవిన। వచ్చెదుద్రోణాద్రిఁదెచ్చి. పాపపుశక్తిన్।
జచ్చెడులక్ష్మణు ప్రాణము। లిచ్చెనితండితనిమహిమ మెఱుఁగంగలమే.

మ. నరజన్మంబు చరాచరంబులను నానాజంతు జాలంబులన్
వరమందుంగడు దుర్లభంబు పురుషత్వం బట్టివాఁడోపుస
త్పరణిన్ భూమిఁ బరోపకారపరతన్ జన్మంబు సార్థక్యముం
బొరయుంగా నొనరించుకోవలయు నిప్పుణ్యాత్ము చందంబునన్. ౯౯

చ. తమరు మనుష్యులందఱు వృథా చెడిపోవక జన్మమెత్తియు
త్తములయియుంట కోపినవిధంబున నేదయినం బరోపకా
రము నొనరించి పెంపిలఁదిరంబుగ నిల్పఁగనొప్పఁగానిచో
నమరవె తత్స మానతమ్మ గాదులు పేరుప్రతిష్ఠగల్గునే? ౧౦౦.

వ. ఏదపంబరాబరులు సేసినడచుచున్న సుగ్రీవాదులంజూచి.- ౧౦౧

సీ. హరిసేనతోవచ్చి హరికిసహాయంబు గావించె నితఁడుసుగ్రీవుఁడరయ
నన్నతోఁగలహించి యాగతుండై రాము వేఁడెనీతండు విభీషణుండు
మునసియాలోచనములు సెప్ప నేర్పరియితఁడుభల్లూకలోకేశ్వరుండు
భీమనికుంభిలాహోమంబు చెడునట్టులాచరించె నితండ యంగదుండు
జగతివీరెల్ల దేవతాంశములరామభద్రునకుఁదోడుపడుటకై ప్రభవమంది
యేపుమీరిరి వానర రూపములనువీరిబలముల నగ్గింప నేరితరము. ౧౦౨.

చ. నరపతిసూతి రాముఁడు వనంబునఁ బత్నిహరించు రావణా
సురుఁదునిమెన్నహాయపడుచోఁగపులంచనుటల్విలాస మా
వరయుతుఁగూల్ప శౌరియిటుభాసిలెవేల్పులువీరు సీతయా
సిరిదొరసాని చింతమ్మ పచిత్ర మిదంతయు మీరువింటిరే! ౧౦౩.

వ. అనుచు నీచందంబునం గ్రంథకొని మందగమనలమందానందంబునం
గొనియాడుచుం గనుచుండ శ్రీరామచంద్రుండు మందగమనంబంగీక
రించి, వందిసందోహసంకీర్తనంబును, మాగధ మధురగానంబునుఁ, బా
ఠకపఠన రవంబునుఁ జెలంగఁబుంఖానుపుంఖశంఖభేరీమృదంగవేణు వీ
ణాది నిక్వాణంబులు రోదసీకుహరంబున రాణలెసఁగ, నంగదజాంబవ
దాదులు నడుగడుగునం బరాబరులు సేయ, హనుమంతుండు దానడు
గడుగునకు మడుఁగు లొగ్గ, సౌమిత్రి యాతపత్రంబువట్ట, దనుజ

రాజును వానరరాజునిరుగడల పీచోపులిడుచునడువ, జానకీకరాంగుళి
గ్రహణంబొనరించి నడచుచుం బోయి పోయిసేనల నెల్లందగిన తావు
లనుండనియమించి తాను తన్నకై తత్పురాధినాథుండు ధర్మనాథుండు
భక్తింజేసి యలంకరించిన యొకకా రమణీయ భద్రోదవసితంబున స
జాయాను జంబుగానధివసించి నాడుగడపి,మరునాడరుణోదయంబు
న నయంబున మేలుకాంచి,కాల్యకరణీయంబులు సాకల్యంబుగ నెరవే
ర్చి, సభామంటపంబునం గొలువుదీర్చి,ధర్మనాథ సుగ్రీవాంగదజాంబవ
దాదులరావించి వారికిట్లనియె. ౧౦౪.

చ. నరహరి దేవళంబునకు నాతియు నేనునుఁ బోయినప్పుడా
హరి పాదసూపినామదికి నర్మిలినిట్లని యానతిచ్చెనో
నరవర,పుణ్యభూమి యిదినాఁబడునేని వసించియుండుటన్
హరుఁడును నిల్చియున్నాఁడుగదా! యవిముక్తముతోడనీడగున్ .౧౦౫

ఉ. నీవునునుష్యమాత్రుఁడవె?నీరజలోచన, నీకునాకునున్
భావనసేయ భేదముగనంబడునా?ఘనులైనవారికిన్
రావణుసంహరింప రఘురాముఁడవై ధరఁబుట్టినాఁడ వి
ట్లీవెహరుండవీవె హరివీవె ప్రజాపతివీవె సర్వమున్. ౧౦౬.

సీ. పెనుఁజేపవై తొలిమినుకు తెక్కలికానిరక్కసిఁబెన్నిట రాసితికద
తాఁబేలవై నీటఁ దరికొండములుగకుండగనెత్తి పీపునఁదాపితికద
పోత్రివై పాతాళమునదూరి బంగరుకంటి సోకునిఁ జావగెంటితికద
నరసింహ మూర్తివై పరగి భక్తులఁబ్రోవనరభోజి వ్రేల్మిడినటికితికద
వడుగవై యబ్బలీంద్రు నుక్కడచితికద
భార్గవుఁడవై దురాత్ములఁ బాపితికద
రామచంద్రుండవై యిప్డురావణాది
దుష్టశిక్షయొనర్చితి శిష్టరక్ష. ౧౦౭.

వ. నీవుమాయామానుషవిగ్రహుండవైన కతన రావణాది రక్షఃప్రమా
పణంబునఁ బాపంబుగలిగెనని తలంచియకదా? యెడనెడ శివలింగ

ప్రతిష్ఠలం జేయుచుంటి వదిజగ దుపకారంబునకయ్యేఁగాని భవన్ని
మిత్తంబునకైకాదు. ఇమ్మహాస్థలంబుననొక్క శంభులింగ స్థాపనంబు
సేసి, యేతద్దేశీయులదురితంబుఁదొలఁగింపుమని యానతిచ్చెఁగావున
నేనిచటనొక శివలింగంబు నిలిపెద మీరు తదుచితసంభారంబుల సమక
ట్టుండని వారినియోగించి కార్తాంతికుల వలన ముహూర్తంబు రహి
త పరిచి హనుమంతుం బిలిచియిట్లనియె. ౧౦౮.

ఉ. ఎల్లిముహూర్తమెట్లయిన నీవవిముక్తముఁ జేరియచ్చొటన్
జెల్లినలింగ మొందువడిఁ జేకొని రమ్మని చెప్పవేగసం
పల్లలిత ప్రభావుఁడలమారుతి మ్రొక్కిరఘుప్రవీరుప
త్పల్లవ యుగ్మమున్నవడకు పట్టెనుదిక్కునకేఁగె వేడుకన్॥ ౧౦౯.

వ. ఇకఁడ సుగ్రీవాదులెల్ల సంభారంబులు సమకట్టిరపుడు సీతారాము
లునిర్వర్తిత నిత్యకృత్యులై యాగమోక్త క్రమంబునం బ్రాథమిక
సంస్కారంబులందీర్చి, ముహూర్తంబు వేచియుండిరటనాంజనేయుం
డును వారాణసిందఱిసి, గంగాస్నానంబును విశ్వేశ్వరాదిత్రయస్త్రిం
శత్కోటి దేవతా దర్శనంబునుం గావించి, యొకటి తేజోలింగంబు
సంతరించుకొని, యతిత్వరితంబున నఱుగుదెంచి రామునకర్పించుటయు
నతండునుఁ బరమానంద కందళిత హృదయారవిందుండై గ్రహిం
చి, కన్నులంగప్పుకొని, పురోహిత ముఖంబున నుక్తప్రకారంబు
సంప్రోక్షణాదికంబును ధాన్యాధివాసజలాధివాసాదికంబునుఁగావిం
చి, శుభముహూర్తంబున శుభతూర్యంబులు చెలంగఁ బ్రతిష్ఠించి,
కళాన్యాసాదికంబుచేసి, షోడశోపచారంబులం బూజించి, యుపాయ
నపిలిచి, యదియపేరుపెట్టి యిట్లనిప్రార్థించె. ౧౧౦.

శ్లో. దాక్షాయణీపృథులవక్షోజగంధయుతవక్షః కవాటకలిత
శ్చక్షుస్సుపర్వలసదక్షయ్య కాంతికరబుక్షాధినాథ మకుటః
అక్షీణసత్యజిత రూక్షేభభక్షకమహోక్షోత్తమార్వాగమన
శ్శిక్షాకరోబుధవిపక్షేషు రక్షితజితాక్షశ్శుభందిశతుమే. ౧౧౧.

శ్లో. పరమేశ్వర గిరిజేశ్వర సదనశ్వరవర స
త్కరుణాకర గురుణానుతకరణామరశరణ
నిరుపాధిక జనపోషక వరవేషకనిరతం
పరిపాలయవసుధరాలయ వరుణాలయశరధే. ౧౧౨.

శ్లో. వందే స్కందసనందనకందం నందిత నందిమునీంద్రం స
త్కాంశం జన్మవినాశననాశం భాసురవాసవ హృద్వాసం
శర్వం సర్వ సుసర్వ సుఖోర్వీం గర్విత గోవర గంధర్వం
లీలాచాలిత పాతకజాలం పాలితసన్మనిరాడ్బాలం. ౧౧౩.

శ్లో. పాహిమవసకల జనాంతర్యామిన్ సనకాదిసన్నుతామలధామన్
స్వామిన్ భక్తావనసుప్రేమన్ వృషభాధిరాడ్వరేణ్యలలామన్. ౧౧౪

వ. అనిప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు వాత్సల్యంబునవత్సా
వరంబు వేడుమనుటయుం బ్రసాదంబని రామ చంద్రుం డిట్లనియె.
అయ్యా! యియ్యారంగలవారిచేతం బూజితుండవగుచు శాశ్వతైశ్వ
ర్యంబు లొసంగిజగంబేలు చుండుము సేవకులకాయు రారోగ్యైశ్వ
ర్యాభి వృద్ధియునుఁబరమార్థ చింతయుందుదకు మోక్షంబు నొసంగు
ము - అకాలమరణంబు భక్తులకెవ్వరికినిం గలుగకుండఁబ్రోవుమిదియ
మద భీష్టంబనిన నట్లకాయనిచ శేంభుధరుఁడంతర్ధానంబు నొందెనం
త రఘురాముఁడును గృహంబుజేగి, నాడుగడపి మరునాఁడరుణోదయం
బునఁ బ్రయాణోన్ముఖుండై తమ్మునుపవచ్చు ధర్మనాథుం బౌరజానప
దసహితుంజూచి యిట్లనియె. ౧౧౫.

చ. పరమపవిత్రమైన నృపవంశమునందునఁ బుట్టినట్టి స
ద్వరుఁడవు, సత్స్వభావుఁడవు, దారయశసుఁడవైననిన్నుమే
మరయఁగవచ్చి సేవితులమైతిమిప్రోలికిఁ బోయివత్తుమీ
పరిచయ మెప్పు డేమఱమవశ్యముఁ గూర్తుము నీకుసంపదల్. ౧౧౬

ఉ. విశ్వమెఱుంగ నిప్పురిని వేడుక మేమొనరింపనొప్పురా
మేశ్వరుఁ బార్వతీశ్వరునకింపగునాలయ గోపురాదులన్
శశ్వదనంతభక్తిమతిసల్పుము నిల్పుము దేవదేవునిన్
శాశ్వతకీర్తిసంపదలు సంభవమయ్యెడు నీకునెప్పుడున్. ౧౧౭.

క. గుడిగట్టి శిఖరమెత్తిన। గడుసరిలింగప్రతిష్ఠ గావించినయా
తఁడువొందుఫలముకంటెన్। మడుఁగులునూతెకుఱ ఁడొందుమహితల
(మందున్. ౧౧౮.

క. ఇందందుసుఖముఁజెందెద। విందుకళాధరునిఁ గొలిచితేనినరేంద్రా
సందేహమేమి? కరుణా। కందుననకాతనికినుద్దిగలఁడే? జేజే. ౧౧౯.

సీ. కడలిఁద్రచ్చెడు వేళఁగలిగినవిషము పుక్కిటఁబట్టి జగమురక్షింపలేఁడె
సురలకసాధ్యమైపరఁగు నలువపున్కఁ జేపట్టి జగమురక్షింపలేఁడె
కూసియెల్లఱఁజంపికొను లేఁడి రక్కసుఁజెవిఁబెట్టి జగమురక్షింపలేఁడె
విపరీతమొనరించు త్రిపురాసురుల బాధఁజెడఁగిట్టి జగమురక్షింపలేఁడె
మఱియునసితరసాధ్యమైపరగుపనులనెన్ని యేనియొనర్చినాఁడెన్నఁదరమె
యట్టిలోకైకపూజ్యునకభవునకునుఁజాఁలియొక్కఁడుదైవంబుజగతిఁగలఁడె.

వ. అనిమఱియనోధర్మనాథా, నీవునాకత్యంత భక్తుండవు ధర్మశ్రవణాస
క్తుండవుం గావుననీకుఁగొన్నిధర్మంబులెఱిఁగింతునాకర్ణింపుము.౧౨౧.

సీ. ఇంద్రియబంధంబు, నిష్టధీసచివవాక్యప్రవర్తనమును, విప్రహితము,
పురదుర్గరక్షణంబునుఁ, బ్రజారామాదిపాలనంబును, మహీపాలజయము
కాలోచితవ్యయమూలమునందిచ్చుమతరక్షణంబును మనుజహితము
నశ్వేభయానంబునస్త్రశస్త్రకలాపపరిచయంబునుఁ, గవివరులమైత్రి
మఱియునవరోధజనరక్ష, మంత్రగుప్తి
కొడుకులనునేసిస్వాతంత్ర్య మిడకయుంట
నెఱిఁగికొన రాజధర్మంబులివియసుమ్మి
వీనిఁదవిలిన రాజభివృద్ధిఁజెందు. ౧౨౨.

చ. మనుకృతధర్మశాస్త్రమును మానుగ నేర్చి నరేశ్వరుండదం
డ్యునిమరిదండ్యు నేర్పరిచి యోగ్యులుమంత్రుల మంతనంబునన్
ఘనిచియుఁద్రుంచియుం దనుఘనంబు యశంబునుఁ బొందు లేనిచో
ఘనమగుకిల్బిషంబుననుఁ గ్రాఁగెడుజీవుఁడు వొవ్వుపిమ్మటన్. ౧౨౩.

క. పుడమిఁగలతనదుప్రజలనుఁ। గొడుకులఁబలె నెమ్మి నేలుకొని నేర్పలరన్
గడుసరివారలఁ బ్రగడల। నిడుకొనఁదగుఁ దనదుచెంత నెకిమీనికొగిన్.

క. పరసతులమాతృభావనఁ। బరికింపుచు సత్యమార్గపాలన రతుఁడై
పరగిననృపుని రాజ్యంబునఁ। బరువముగా నెలకుమూడువానలుగురియున్.

ఆ. తనదు చారదృష్టికెని మాఱుతోఁడుగా
గుప్తవేషములనుఁ గువలయేశుఁ
డూరుఁదిఱిగి ప్రజలనూహించి రాఁదగుఁ
దగదుస్వామితనమగునుఁ జెడుగు. ౧౨౪.

మత్త. అన్నశాలలు ధర్మశాలలు నాలశాలలుమందులన్
వన్నెకెక్కిన వైద్యశాలలు పాఠశాలలు దేశదే
శోన్నతిం జను గ్రంథశాలలు నూళ్ళఁబల్లెలసిల్పి తా
నెన్నడారయుచుండఁగాఁదగు పృథ్వినాథుఁడుశ్రద్ధమై. ౧౨౫.

క. జీవనయంత్రంబులకున్। జీవనములనిలువరింపఁజెప్పఁగనగునా
జీవనయంత్రము లెల్లెడఁ। గావింపఁగవలయు నృపశిఖామణిపుడమిన్.

క. పలువ్రుసపలుదెఱఁగులమదిఁ। గలఁగించినఁగలఁగకొండుగతులఁజనకస
త్కులధర్మముతప్పనిజను। డలరున్ శ్రేయాన్ స్వధర్మయనునుడినిజమై.

ఆ. అగ్నిఁ వేల్వఁబడినయాహుతులాదిత్యు। నంటునతఁడు వర్షమమరఁజేయు
వానన న్నమలరుదానఁబ్రజదలిర్చుఁ। గానఁజేయ నామఖంబులుర్వి.

ఉ. లంచముఁగొంటయో? చదువులాఘువమో? యవివేకమో?జగ
ద్వంచనమో? ప్రమాదమొ? ధ్రువంబనఁజాలముగాని న్యాయమా
లించియథార్థమారయుటలేమ పదస్థులు లోకులార్తిదుః
ఖంచెదరంత భూపతికిఁ గీడగు నారయకుండెనేనియున్. ౧౩౧.

ఆ. కప్పమీఁగలేక యప్పులఁబడి నిస్వుఁ। డై చెడంగనున్న యట్టివాని
నుద్ధరించి రాజులోమంగఁదగుజెట్టు మొదలున ఆకనగునె మొగడకొరకు

క. తనకడఁదిఱిగెడు మనుజుని। గొనముఁ బరీక్షించి కాని గొబ్బున సఖ్యం
బొనరింపఁ జనదు దానం। దనరు సహాయంబు ధర్మనాథా, తెలియన్.

క. భువిజనులకు రాబడినా। ఆవహాళ్కప్పంబుగాఁగ అవినీతులనిం
పవునట్లు పడసి విత్తం। బవులం దత్పోషణార్థ మదివిడువఁదగున్. ౧౩౪

వ. భూమీశ్వరుండు జాగరూకుండై సప్తవ్యసనాది దోషంబులకెడమై, దేవతాప్రతిమానులగు భూదేవతల మన్నించి పూజించుచు, ననదలగు బీదల మూఁదలసాదుచు, నానమీరిన దురాచారులు విద్యావిచార సారులుపాఱులైన దేశదూరులుగాఁ గావించుచు, నారామతటాకాదుల నిర్మించుచుఁ, జతురుపాయంబుల నరులనఱికట్టి ధనార్జనంబుసేసి, బొక్కసంబు నిండించుచుఁ, బరదారాసక్తిం బరిహరించి వర్తించుచు, సిరిరాకపోకల సంతోష దుఃఖంబులం బొందక, యెప్పుడును దైన్యం బెడఁదగులనీక, సర్వజన సమ్మతంబుగా రాజ్యంబుసేయు రాజునకిహ పరసుఖంబులు కరతలామలకంబులని వెండియు. ౧౩౫.

తే. ఆర్జితార్థముఁ గుడువక యర్థికీక
దాచుకొనఁ దేనెపెరవారెఁ దరలు సర్వ
మింత విడుచుండెనేనిపో దెసఁగెడు మరు
గొన్ముగల తటాకమ్ము జలమ్మువోలె. ౧౩౬

ఉ. బాణము తాకనున్న ధనభారము వోయిన ధాన్యమేఁగినన్
రాణులు సెల్లినన్ సుతులునల్గిన మానము హీనమైననుం
బ్రాణముఁదీయఁ జాలెడు నపాయము వచ్చిన వంశమేఁగినన్
వాణిన సత్యమార్గమునఁ బాల్పడఁజేయఁగరాద యేరికిన్. ౧౩౭.

తే. మంచికార్యము సేయఁ దానెంచినపుడు
మొదలఁ గష్టమైనను మేలతుదకుఁ గలుగు
బొంకకన్న హరిశ్చంద్ర భూవిభుండు
గాదసుమంత్రైనఁ దుదఁజాలఁ గొనడె కీర్తి. ౧౩౮

శా. ప్రారంభించిన మంచికార్యములకుం బ్రత్యూహముల్గల్గి, వి
స్తారాయాసము సంభవించి, మదికిం దబ్బిబ్బునుం గల్గినన్
ధీరోదాత్తుఁడు తానుఁ బట్టుదలతోఁ దెల్విన్ బ్రయోగించుచుం
బారంబున్గొనముట్టఁగాఁదగు జగత్ప్రఖ్యాతి సంధిల్లఁగన్. ౧౩౯.

ఆ. జరయు మృతియు లేని పరమౌషధముఁ గోరి
కడలిఁ ద్రచ్చుచున్న యెడల విషము
అంతరాయమగుచు నావిర్భవించిన
సుధనుఁగొనిర కాని సురలు విడిరె. ౧౪౦.

క. సోమరితనమున మదిలో। నేమరక వృథాదినంబు లేగింపక తా
రేమియుఁ బనులఁగళల। నామోదమునఁ శ్రమపడఁగనగు నేవారున్.

ఉ. తల్లివలెన్ సదా మనముఁ దండ్రివలెన్ హిత బోధ సేయుఁ బెం
బుల్లసిలంగఁ గాంతవలెనోమి రమింపఁగఁ జేయు నెయ్యున
ట్లెల్లపుడున్ సహాయపడు నెల్లెడ నర్థయశస్సుఖాదులం
గొల్లగఁ గూర్పఁ గల్పలతికం బ్రతియైతగు విద్య యేరికిన్. ౧౪౨.

తే. భువిని విద్యావిహీనః పశువనునట్లు। జడుఁడు లోనఁ బ్రాపంచిక జ్ఞానమెడల
నారులకట్టులఁబడి కడ్డిఁగరవవలసి। వచ్చుఁ గావునఁ జదువు నేర్వంగఁదగును.

ఉ. పోయిన ప్రొద్దులే మఱలఁ బొల్చెడునట్టులు కాలధర్మమై
పోయినవారలెవ్వరును బుట్టిదరింపని శంబుఁ జూచుచుం
దాయియుఁ దండ్రియున్ భ్రాతయునుఁ దమ్ముఁడు నాలియుఁ గూలిరంచు దుః
ఖాయితచిత్తులై జనులు కారియ నొందెదరెంత వెఱ్ఱియో? ౧౪౪

ఉ. ఎందఱికెన్ని జన్మముల నెట్లు మెలంగునో? పుట్టిచచ్చునాఁ
డెందఱు వానికెల్లను మ సేద్చెదరో? నెఱఁ జుట్టలెవ్వరో?
డెందమునం దలంపక కడిందివిచారముతోడ మూర్ఖులై
కుందఁగనేల? కాంగతిఁగూలెడు వారికి నెట్టివారికిన్. ౧౪౫.

ఆ. తనకుఁ దానకాని కననేరు చుట్టము। లెల్లరు వగవరాదు వారిఁ గూర్చి
తాను వారునొకటి కాని కాకుండనీ। వగచి తెచ్చునయ్య వారిమరల.

ఆ. ఆశపూనరాదు ప్రారబ్ధమునఁజేసి। యీశుఁడిచ్చినంతనే! ప్రత్తి
నొందవలయునరుఁడు గ్రిందమీఁదనుఁబడిపొరలి నేనిఁబెచ్చుదొరకబోదు.

శా. ఎంతో! తానుఁ దలంచియున్నపుడు మున్నే చేయుకర్మంబుచే
నింతై నన్గొనసాఁగదందులకుఁ దానే లోనఁ జింతింపనా
సంతాపంబునుఁ బొంది దేవునిఁ దిరస్కారంబు గావింపరా
దంతన్బాతక మావహిల్లి నరకప్రాప్తిన్జనుండార్తిలున్. ౧౪౯.

క. తిననాకులలములుండఁగ। గొననేళ్ళ స్నిర్ఝరులుండఁ గొనరకకట్టం
బనునారలుండఁబండం। గ నేలబండనొరుఁగొలువఁగా నేమిటికిన్.

క. నారలు గట్టుకొనివనిం। గూరలుదినుచుండు మునులకున్నే లిమిబం
గారుజలతారుచీరలు। సారాన్నముగొన్న నృపులుసరిఁబోలుదురే.

ఆ. ఆకులైన నేమి? యలములైనను నేమి? సూపమైన నేమి? యపూపమైన
నేమి? వేఱురుచులకేమి? యాఁకలిఁదీర్చుకొనుటకన్నఫలముజనునెలోన

క. పెనుఁబాము విషంబొడలి
కైన మందులడింపవచ్చుఁ గెరలెడు చెలిచూ
పను విషము డిగక చెఱుచున్
వినుమీ! చెలిచూపువిషమొ? విషమే విషమో? ౧౫౨.

మ. కలలోఁగన్న పదార్థమట్టిదిజుమీ! కాంతాకుమారాదికం
బిలనీయంతయునాశమౌను, జగమేవీక్షింపమిథ్యాత్వమై
పొలియు, న్వాంబరవిత్తులై చెడిమహామోహాబ్ధిలోమున్గక
వ్వలఁజింతింపుఁ, డనశ్వరుండగు పరబ్రహ్మంబు తానొకరుఁడే. ౧౫౩.

చ. నలకలకన్న నలఁయికసఁబడి, పెద్దలకన్నఁ బెద్దయై
నెలవొకచోటునాఁక మఱినింగియు నేలయు నిండఁబొంగియుఁ
దులువల కెల్లలేడనఁ గఁడోఁ చెడుదైవము తానునేనయై
వెలిఁగెడు జ్యోతిని న్దలఁచివేయిదెఱంగులఁగొల్వఁగాఁదగున్. ౧౫౪

వ. అనుచు రామచంద్రుండెల్లవారును వినధర్మనాథునకు ననేకవిధధర్మం
బులుపదేశించుచుండఁదన్ను సేవించుచుం జుట్టువారుకొన్న పురంధ్రీర
త్నంబులం దరళంబునుం బోసిరాజపత్ని గుణమణింగనిసీతయిట్లనియె.

చ. గరితకునన్నడు న్మగనికన్నను దైవమొకండుధాత్రిపైఁ
బరఁగడు వానినిన్నరమభక్తి వ్రతంబుగఁ గొల్చుచుండినన్
గురుతరసౌఖ్యసంపదలకుం గుదురై యిహమున్పరంబునుం
బరువడినొప్ప నొప్పెడుసమస్తనుతాతి విశాల కీర్తిమై. ౧౫౬.

తే. మగని సేవించు ధర్మముల్మగువలకున
వశ్యముగ నేర్చుకొనఁ దగువానినెల్ల
మిగులనక్కటికంబున మీకుఁదెలుపు
దానదత్తావధానలై తవిలివినుఁడు. ౧౫౭.

సీ. పాదముల్గడిగివేఁ బవ్వ్యంటఁదడియొత్తివిభుని వీవనలతో వీఁచుచుండి
భోజ నాంతమునందు భుజియించి తత్పాత్ర, నిదురవోయిన వెనక (నిదురవోయి
లేవకున్నప్పుడలేచి, పిల్చినయేనిఁజేఁబని విడిచిచెచ్చెఱ గమించి
పనియున్న, సుఖసుప్తుఁడునుసుఖాసీనుఁడైయున్నప్డు లేపకయుండిభక్తి
జీవితేశ్వరునెదలోనదైవమనుచుఁ। దలచిసేవించుచున్న యాకలికిమిన్న
క్షితినిఁ గొనియాడఁబడి పతివ్రతయనంగ। నిందునందును సౌఖ్యంబుఁ (జెందునిజము. ౧౫౮.

ఆ. సతులుపతినిఁగాకశంకరునేనియుఁ। దలఁపఁజనదుజపము,దపము, దీర్థ
యాత్ర, మంత్రసాధనాదికమెల్లను। సతికిఁబతియచూవెజగమునందు.

తే. జీవితేశ్వరు నెదలోన నేవగించి
సారెసారెకుఁ బోరెఁడు సారసాక్షి
నీక్షణముసేయఁ బాతకమెల్లవేళ
భయము భక్తియుఁ గదురంగ వలయుమెలఁగ. ౧౬౦.

మ. ముదుకండైననుమూర్ఖుఁడైననుఁగురూపుండైనదుర్మార్గుఁడై
నదరిద్రుండయినన్గదాన్వితుఁడునైనన్గ్లీబుఁడైనన్మహా
పదలంజెందెడు వాఁడునైనఁగలుషవ్యాపారుఁడైనన్విష
(పదుఁడైనంబతియే సదాశివుఁడగున్భావింపఁబూఁబోఁడికిన్. ౧౬౧.

# కనకగిరి.

ఉ. చక్కనిదాననం చెవత సంతతము న్బతినింద సేయునా
చక్కెరబోఁడి కుక్కయయి సారెఁ బురీషములన్భుజింపుచున్
సొక్కి యనంతరంబునను సాంపతిమాలెత్తయి జనించియే
దిక్కును లేక దుఃఖములఁ దేలుచునుండెను బెక్కువర్షముల్. ౧౬౨.

క. పరపురుషునెవతలీలా। కరదృష్టిం జూచు దాని కన్నులయమకిం
కరులగ్గినెఱ్ఱఁగాలిన। సురియలసూదులనుఁ బొడిచి స్రుక్కింతురొగిన్.

తే. మిండగీఁడును గోవాఁడు మిసిమికాఁడుఁ
దానొకరుఁ డెందు నేని యేఁదారసిలిన
నోరఁజూడక మదిలోల్యమొందనీక
తలను వంచుకొని తొలంగఁ దగును సతికి. ౧౬౪.

తే. పంచమాతలుదక్క ప్రపంచమందు। వందనీయలువిధవలుపరగ రెండు
నరులకవ్వారి దీవనగరళసమము। గాననైదువ చేరంగఁగాదు వారి.

క. పతియాజ్ఞవడసి హరితిథి। వ్రతమొక్కఁ డుదక్క నరక భాజనమగుటన్
బతియుండంగను పోష।వ్రతమొనరింపంగరాదవని తామ్రోకిన్. ౧౬౬

తే. మనమునను వాక్కునను కాయమునను బతికి
హితముగావించునది పతివ్రతయకాని
కేవలము మానమొండు రక్షించుకొనుచుఁ
బతిని నిందించునది పతివ్రతయకాదు. ౧౬౭.

క. సతికన్న మంగళంబును, శితికంఠుని కన్నవేల్పు, శ్రీకన్న మహో
న్నతి, కులటకన్నఁ గీడును, మతినెంచఁగఁగాన రావు మహితలమందున్.

ఆ. ఇరుగుఁబొరుగు పడఁతులెమ్మెమై భూషలఁ
గొంటజూచి సతులు కుతుకమనుచు
వానికొఱకు మగనిఁ బూని వేఁపఁగరాదు
మెఱుఁగులేల? యొఱుల మెప్పులేల? ౧౬౯.

క. అరయఁగ నాభరణాదుల। సరసిజనేత్రలకు సొంపుసంపాదింపన్
బరగవు, సొంపును నింపును। గరితతనంబెపుడు విడకకాపాడుటయే!

సీ. చిన్ననాటనుఁ దన్నుఁ గన్నవారలనుడి నెఱిమీఱకపనులెల్ల నేర్వవలయుఁ
పాణిపీడనముగాఁ బ్రాణనాథునియింట మెలఁకువ నడఁకువ మెల్గవలయుఁ
నత్తమామలయాజ్ఞ బత్తిమైనడపుచు నేరాండ్రఁ జెల్మిమైనెంచవలయు
గన్నబిడ్డలుమంచి గతులమెల్గఁగనీతులింపున నెపుడుబోధింపవలయుఁ
గొమరితలఁబోలెఁ గోడండ్రఁ గొనఁగవలయు
నోము లెప్పుడు శ్రద్ధమై నోఁచవలయు
విసువ కభ్యాగతులను సేవింపవలయు
నాఁడుపుట్టువఁ బుట్టినయట్టివారు. ౧౭౧.

తే. బాల్యమునఁదండ్రి, పిమ్మటభర్త, పిదపఁ
గొడుకులును, స్త్రీకిస్వాతంత్ర్యమిడమి తాను
ఏదియునువారిఁ గాదనికాదుచేయఁ
జేసెనేనియుఁ జెల్లదాశేఁతప్రుడమి. ౧౭౨.

తే. భర్తృశుశ్రూష జేయుచు భక్తినున్న
యెడల హరివచ్చెనే విడియేఁగరాదు
వినమె భవతిభిక్షాం దేహియనెడు కౌశి
కునిఁదలంచెనే? సతి, పతిఁగొలుచుచుండి. ౧౭౩.

క. నీడ తెలుంగునమగనిం। గూడిసదా సేవ సేయుగుణమణి పూర్వం
బోఁడికిదైవమతోఁడుం। గాడే? సాధింపరానికార్యముగలదే. ౧౭౪.

సీ. చచ్చినపతి వెండిఁ దెచ్చెను సావిత్రి తనదు పాతివ్రత్యమునన కాదె
యేచ్చుకార్చిచ్చుజల్లార్చెఁ జంద్రమతియుఁ దనదుపాతివ్రత్యముననకాదె
చెడుగుబోయను నీఱుఁజేసెనుదమయంతి తనదుపాతివ్రత్యముననకాదె
పుత్రులఁగనియేఁద్రిమూర్తులననసూయతనదు పాతివ్రత్యముననకాదె
సామిసామేన నెలకొన్నహైమవతియుఁ
పతి యురమ్మందు వెలుగొందు భార్గవియును
భర్త తలవాకిళులనాఁడు భారతియును
దనరుచుండ్రు పాతివ్రత్యముననకాదె. ౧౭౫.

ఆ. గరితయైన దానిఁగన్న తిత్తి పాలాత్ముఁ। డైనఁజూడ లేదుకానిబుద్ధిఁ
గానమీరుదానిఁగాపాడుకొనఁదగు। ముజ్జగంబులందుముదముమీఱ.

వ. అనిమఱియు ననేకవిధ స్త్రీధర్మంబులుపదేశించుచున్న యవసరంబు
నం బ్రయాణభేరి మ్రోయించిరపుడు రామ చంద్రుండు సకలసేనా
పరివృతుండై కదలి, యాసీమాంతమనుప వచ్చినపౌరులనామంత్రణం
బు చేసి, పుష్పకంబెక్కి-కొని, సకలజనారాధ్యయగు నయోధ్యకుం జ
ని, పట్టాభిషిక్తుండై పూజ్య సామ్రాజ్యంబేలుచు సుఖంబుండె నిదిరా
మలింగేశ్వరప్రతిష్ఠాక్రమంబింకస్థలమహత్వంబుఁజెప్పెద నాకర్ణింపుఁడు.

ఉ. శ్రీరఘు రాముఁ డెంతయునుఁ జిత్తమురంజిల నిల్పికొల్వఁజె
న్నారెడు పార్వతీశ్వరుననంత కృపాతి శయంబునన్ ఘనం
బైరమతోడనిండుకొని యందఱికున్సుఖ మిచ్చునల్లక
ల్లూరునగొల్లవాఁడొకరుఁడొప్పెడు నప్పటికాలమందునన్. ౧౭౮.

తే. పిల్లలును మేఁకలావులు నిల్లు నింటి
యాబిడయు బిడ్డలునుఁ దన్నునావరించి
యుండ సిరులంది కుతుకంబు మెండుకొనఁగ
నూరిప్రజల నెఱుంగకయుండు వాఁడు. ౧౭౯.

క. గోపాలుఁడతఁడ జస్రము। గోపాలనమాచరించి కుతుకమెలర్పన్
గోపాలుఁడు తనసాటిగ। భూపాలకసభలయందుఁ బొగడఁబడియెన్.

తే. కనకగిరియందు నడవిమేఁకలనుమేపఁ
దిఱుగుచును దారినాఁగెడు తీఁగలెల్ల
నఱుకుకొని దారిఁగావించి యఱుఁగుచుండు
మేఁకలనుఁగూడి గోపాల లోకవరుఁడు. ౧౮౧.

తే. ఇటులునిచ్చలుఁదిఱుగుచు నటవులందు
నిన్నఁనఱికిన బాటమైనేఁడు పోవ
నగుననుచుఁజేర నెప్పటియట్లు కలిసి
తీఁగజొంపంబు చూపట్టఁ దెలిసి యతఁడు. ౧౮౨.

చ. తనమదియందు నిట్లనుచుఁదర్కముచేసె, నిదేమి? నిన్న నేఁ
జనునపుడీఁడ జొంపమయి సాఁగినతీఁగలఁ జెట్లఁద్రుంచి, పో
వనువగుబాటచేసితి, నహా! యిపుడెప్పటిఁగూడిచిక్కనై
కనఁబడె నిన్నచోటులివిగావొకొ? మార్గము తప్పినాఁడనో?. ౧౮౩.

తే. బాటతప్పిన చొప్పింత తేటపడదు
లతలుతరువులు వెండియు నతుకుకొనిన
యట్లుతోఁచెడునామది కట్టులైన
నఱికి చూచెదనని యెంచి మఱియువాఁడు. ౧౮౪.

వ. తనచేతికఠోర కుఠారంబున నెదురనున్న యొక్క కుంజంబు నఱికి, చూచు నంతలో వెండియునతుకుకొని యెప్పటియట్లొప్పియుంటయు, వాఁడు వెఱఁగందిన డెందంబునంబొంది, సందెపడ నిజమందిరంబునకఱిఁగి, నాఁడు గడిపి మఱునాఁడుదయంబున లేచి, యప్పటియట్లజంబులం దోలుకొని, యడవికఱుగు నవసరంబున నొక్క బ్రాహ్మణబ్రువుం డెదురుకొనినంగని దండబువెట్టివాఁడిట్లనియె. ౧౮౫.

శా. ఓరీ, బాపఁడ, వింటివంటర! వెఱంగుండెన్నుమీ! కొండపై
నారా! త్రెంచినతీఁగలంటు కొనిమానై యుండురా! వెండియున్
రారా! చూఁపెదనన్న బ్రాహ్మణుఁడును న్సంతోషమగ్నాత్ముఁడై
పారెంగొల్లని వెంటనంటుకొను తీవల్గల్గు నచ్చోటికిన్. ౧౮౬.

వ. అట్లుచని కనుంగొని బ్రాహ్మణుండత్యంతాశ్చర్యమగ్నాంతరంగుఁడై తనమనంబున. ౧౮౭.

క. ఇది సంజీవనిలతయో? యిదిచింతామణియొ? చూడనిధికల్పకమో?
ఇదిపరుసవేదియగునో?యిదిహరిచందనమొ? తెలిసియెన్నం దరమే.

వ. ఇదిమహాపథంబు దీనసాధింపరానికార్యంబొకండునులేదు, ఈవృత్తాంతంబజ్ఞుఁడగువీఁడు నాకుఁబలె నన్యులకుంజెప్పిపుచ్చు. వీని నేయుపాయంబుననైనంజంపి, యిమ్మహాలతను వశంబుచేసికొందునని నిశ్చయించి, భయంపడు నట్టివాక్యంబుల వానికిట్లనియె. ౧౮౯.

చ. నఱికిన వెండియంటు కొనినల్వగు చెట్టిదియంచు నెంచె దీ
వెఱుఁగక ప్రత్యహంబిటుల యీలత చెంతకు వచ్చుచుంటివీ
మొఱువ పిశాచ మిట్లునిను మోసము చేసి భుజింపనుండెని
త్తెఱఁగునఁ జెట్టులుంటకలదే? జగమందున వెట్టిగొల్లఁడా. ౧౯౦.

తే. బ్రహ్మ రాక్షసియిది జగత్ప్రళయమైన
నాశనముఁ జెందదందఱ నమలివైచు
ఘనుఁడు నాయట్టిడగు మాంత్రికునకుఁగాక
సన్న సన్నముగా హుష్షునున్నఁ జనునె. ౧౯౧.

వ. అనిచెప్పి వాని నొప్పించి, యోరీ, నీవీదారి నిచ్చలును వచ్చుచుండుదువు ని
న్నీ పిశాచంబెప్పుడో విఱుచుకొని తినకమానదనినం గడగడవడంకుచు
నప్పంచజనుం డావంచకున కిట్లనియె. ౧౯౨.

క. నాయవ్వకు నేనొకఁడ! నేయుంటినిగాననన్ను నేలాఁగైనన్
నాయయ్య కాన వెలిగా! నీయక యోమంగదయ్య నెయ్యంబలరన్. ౧౯౩

క. దండము వెట్టెదనయయో! గండముఁ గడపించి పజలఁ గలుపవె నన్నీ
పిండినదుత్తెడు పాలున్! నిండగా బొట్టఁ బోసి నీకో జియ్యా. ౧౯౪.

తే. నేనుఁ బిల్లలు మేకలు నిచ్చలిటకు
వచ్చుచును బోవుచుందుమీ వరుసబూత
మెప్పుడేమి చేయునో! బీతుగప్పెలోన
దీనిఁ గడతేర్చి సాకవే! బాని సలను. ౧౯౫

వ. అని సభయుండై ప్రార్థించుచు వీరడి మాటలాలించు వెట్టిగొల్లనింజూచి
క్రూరుండగు పాఱుండిట్లనియె. ఓరీ, దీని నేనెట్లులైన నామంత్ర సా
మర్థ్యంబున భస్మసాత్కృతముగాఁ జేసి నీభయంబు వాపుదు వగవకుమ
ని చెప్పి, యప్పట్టునం గొన్ని శుష్కతరుకాష్ఠంబులు ప్రోఁగు వెట్టి, యొ
క్క పెద్దమంట వెలిగించి, తాను గొన్ని మాయామంత్రంబు లుచ్చరిం
చుచుం గొల్లవానితోడఁ గూడఁ బ్రదక్షిణంబు సేయుచు, నమ్మహాజ్వా
లయందు వానిం బడఁద్రొబ్బ నుంకించుటయు నంతలో దైవవశంబునం

జేసితప్పించుకొని, యాగోపాలుఁడక్కీరలకంబెఱింగి,వీఁడు మోసగాఁడు
నన్నుఁజంపి, యీయబ్బురంపుఁదీవఁదనుహరింపం దలంచెవీనినీకాఁటి
దేవరకుఁ బ్రీతిగాఁ బొలియించినం దోసంబు వీసంబును లేదనితలంచి,
వానిమెడఁబట్టి కాళులతోనంటఁగట్టి, యామంటపమందుఁ బడవైచి
నిజగృహంబఱిగెనని వెండియు. ౧౯౬

ఆ. ఒరులఁజెఱుపఁదలఁచి యుద్యమంబొనరింపఁ
దానె చెడును దైవతంత్రమునను
గోపుఁజంపిలతనుఁ గొననెంచి పాలుఁడ
డెట్టిపాటుపడెనొ ? యెఱుఁగుఁడీప్రజలు. ౧౯౭.

వ. అంత నాగోపాలుండు మఱునాఁడువచ్చి యగ్గింద్రోయఁబడిన బాపఁ
డొకసువర్ణవిగ్రహంబై యుండుటంజూచి, నిక్కంబ పిశాచంబనితలం
చి, తనచేగొడ్డఁటందాని తలఁదెగనఱికె నఱుకునపుడమఱియునొకరు
శిరంబు మొలిచె. నదిచూచి వెఱంగుపడి కాళ్ళును జేతులును లోనగు
నంగంబులు నఱుకుడునవియు నెప్పటియట్లొప్పుచువచ్చె నంతవాఁడుభ
యభ్రాంత చిత్తుండై తత్తరంబునం బరువెత్తిపోయి తమదంతంబంత
యు ధర్మనాథున కెఱుంగించిన నతండమాత్యజన సహితుండై వాని
తో నక్కనకగిరి పార్శ్వంబునకఱిగి, కని యిదిష్టుపరిభావంబని భా
వంబుననగ్గించి, యాసువర్ణరాశిఁదనవశంబుఁజేసికొని,దానంజేసి రామ
లింగేశునకాలయప్రాకారగోపురమంటపాదులంగట్టించి, యత్యంతై
శ్వర్యంబున నిత్యోత్సవంబులు నిర్వర్తింపుచు, దదనుగ్రహంబునఁగడు
దేశంబుల రాజులంగెలిచి యశంబుఁగైకొని,పూజ్యసామ్రాజ్యం బేలు
చు సుఖంబుండె నంత కొంతకాలంబునకొక్క యవసరంబున. ౧౯౮.

మ. అలవంగాధిపుఁ డొకరునాఁడు కటకంబందాప్తులు న్స్వార్థమం
త్రులు సామంతులు భృత్యులున్సుతులు సంతోషంబునం గొల్వవ
ర్థిలు పేరోలగమందు నిండుకొలువై క్లేశంబుఁ జింతించుచుం
దలపుంజేరఁగ ధర్మనాథుఁ డపుడత్యంతార్తిమై నిట్లనున్. ౧౯౯

మ. ధరణీమండలమెల్ల శాత్రవసతీదైన్యంబునం దోఁగఁబె
కురణంబుల్పొలివోకచేసి కడిమింగోరాడి పోరాడితిరి
బరగెన్నాకుమహాబలుండనెడుపే ర్బ్రహ్మాండ గోళంబునం
దరులేకుంటనొసంగి కొల్చెదరున న్నాయాధరిత్రీశ్వరుల్. ౨౦౦.

క. కనకగిరి ధర్మనాథుఁడు। కనుఁగానఁడ తొంటియట్లుకప్పంబిడిన
న్ననికొల్వరాదుకారణ। మును మీరలెఱింగి నాకుఁబోలంజెపుడీ. ౨౦౧.

వ. అనిన నమాత్యులందుఁ బేరువడసిన మేధానిధిలేచి వక్షఃకవాటఘటి
తకరార్గళదండ్వుండై యిట్లనియె. ౨౦౨.

ఉ. ఓయి, మహాబలా, కినుకనూనకనాపలుకాలకింపు నా
రాయణుఁడారఘూద్వహుఁడు రావణుబ్రేల్మిడి సంహరించి ప
ద్మాయతనేత్రతోఁబురికినర్మిలి నేగుచుధర్మనాథు న
త్యాయతకీర్తిఁబ్రోచి చనె నంచని వార్తలెఱుంగ వచ్చెదుర్. ౨౦౩.

తే. రాముఁడటనిల్పె శివలింగ మామహత్వ
మునను స్థలమహిమంబున ఘనమురామ
భద్రకరుణాకటాక్షంబు వలన ధర్మ
నాథుఁడాఢ్యుఁడై సర్వభూనాథుఁడయ్యె. ౨౦౪

క. రాజులనెల్లరనాతం। డాజుల నోడించి, పుడమినంతయుఁగొని, ని
ర్వ్యాజఘనశౌర్యఖనియై। రాజిలునాతని జయింపరాదెవ్వరికిన్. ౨౦౫

ఆ. ఈఁగనున్నకప్పమీఁడేండ్లుమూఁడైనఁబ్రతిఘటించెమనకుఁబ్రథనమెంచి
యనుచువిన్నవింతు మైదారుపరులైనఁ। బ్రభువులాలకించి పలుకవలెరి.

చ. అనుచు నమాత్యమాళి వినయంబునఁ దెల్పిన నేయిబ్రేల్వ భ
గ్గునఁదెగమండు నగ్గియన,గోల నొకించుక కొట్టబిట్టుహు
మ్మనివడిఱంకవైచుచు వెలార్చెదుబ్రోల్పులినాఁగఁ, దోకఁద్రొ
క్కినఁగదురోజుబ్రాచన, మహాబలుఁడప్పుడలేచియుగ్రుఁడై. ౨౦౬.

వ. హుమ్మనిదీర్ఘనిశ్వాసంబున నొడుఁగఱచి, కన్నులెఱ్ఱజేగురుముద్దలం
జేసి, కుటిలభ్రూకుటియై, మొడలువిఱుచుకొని, గుండెలఱ చేతనప్ప

ళించికొని, యాలీఢపదుండై నిలిచి, యొడలెఱుంగక సింహాసనంబునం గల సర్వపదార్థంబుల నేలం బెట్టికొట్టికొని, కల్పానల్పగభీరభైరవుండ ననేరికిం జూడరాకుండె సభాభవనంబు వగులునో యనునట్లుచ్చ స్వరంబున నాఱ్ఱుచు నిట్లనియె. ౨౦౮.

స్రగ్ధ. ఛండాంశుంజండివైతుక్ ఛవిగివిసడల స్వప్రభూభృత్తులం దో
ర్దండోద్దండాతి శక్తి స్థిరఁ బొడిపొడిగా దంపుమ స్సాబ్ధిపృథ్వీ
ఖండంబుం ద్రవ్వివైతుక్ ఘుటికనఘుటిక న్గాఢ ఘాతంబునం బ్ర
హ్మాండంబు న్మృత్తుభాండంబటులు పగులఁగా నాచరింతున్గడంకన్.

వ. అనికోపోద్రేకంబునం గ్రింద మీదునుంగానక యసంబద్ధంబు లాడుచుఁ బ్రళయకాల మహాబలుండనఁదగు మహాబలుండు కొంచెము శాంతించి కూరుచుండం జేరి మంత్రిచంద్రుం డిట్లనియె. ౨౧౦.

క. వేగిరపడఁజెల్లునె!సా! మీ, గడువుంగాలమరసి మెలఁగఁగవలయుక్
అగము జేసిన యేని! న్సాఁగింపఁగఁగలమె పగరఁజకలనదువఁగక్ ౨౧౧

తే. ధర్మనాథుఁడురాజుని దర్శనమున
మనల సరకుగొనక యోలమునకు మోహ
రించి సన్నద్ధుఁడైయుండె నంచువింటి
మతనిఁ దేరఁ దెరఁగ గెల్వనరిది యిపుడు. ౨౧౨.

వ. సకలమహీమండలాఖండలునకు మహాబలునకా ధర్మనాథునిపైఁ గోత్తల నేయం దలంపవేని యిప్పుడు. ౨౧౩.

చ. తెలతెలవోయె మేఘములు దేజికృశత్వము నొందె వాకలుం
గలకలలాడె హంసములు గాంతములై కమలంబులొప్పెడుక్
జలచలఁ గ్రాలె తెల్లుమృగజాతికి సంతసమయ్యె నిష్పడిం
పలరఁగ రేలఁ బట్టపవలట్టులు తీరిచి కాయు వెన్నెలల్. ౨౧౪.

శా. వంగాధీశ్వరు బారిఁబడ్డయహిత వ్రాతంబురీతి న్మహో
త్తుంగాభ్రంబు లదభ్రభాస్వరశరస్తోమంబు వర్షించి డిం

దంగల్కు ల్తైలతెల్లవోయివిరిసెం దద్భుతపుల్లోవలెనా
గంగాద్వ్యాపగలెండి నీరసముల్తై కన్పట్టునిప్పట్టునన్. ౨౧౫.

చ. క్షితివరదుష్టకీర్తుల నశింపఁగఁజేసి జనాళి మంచిప
ద్ధతినడిపించి మించునిను దక్షపరాక్రమ నిన్నుఁబోలనీ
క్షితితలదుష్టకీర్తుల నశింపఁగఁజేసి జనాళి మంచిప
ద్ధతినడిపించి మించునిను దక్షపరాక్రముఁజూడఁ మియ్యేడన్. ౨౧౬.

చ. అలిగిమహీమహేంద్రుల మహాహవమందుజయించి మించి లో
నలరుమహామహుండగు మహాబలునెమ్మొగ మట్లు పద్మముల్
చెలఁగెను దద్భటాళియుఁ బలెన్మృగజాతిదలిర్చెఁ దత్ప్రతీ
తిలకముల్లట్టులంచ లెడఁదీయక కౌతుకమిప్పుడాఁడెదన్. ౨౧౭

క. భువిసకలశత్రుఘుస్మరుఁ। డవునీదుయశంబురీతి యామినులఁ బవ
ళ్ళవలెన్జేయుచునచ్ఛత। వివరించుచుఁ గాయుఁబండువెన్నెల లధిపా.

క. ఇదియుద్ధయాత్రకనువగు। పదను సుశరదృతువు సీతవాతాతపముల్
పొదలవధికముగసనిసం। పదఁబొదలెపుఁబోలములెల్లఁబార్థివముఖ్యా.

వ. ఇంతకుమున్నయుద్ధసంభారంబులు లెల్ల సన్నద్ధంబుసేయఁబడిరాణు
వకు ఖాణాదు లమరింపం బడియె నింకదేవరచిత్తంబని విశ్రమించిన
నతండిట్లనియె. ౨౨౦.

క. ఆధర్మనాథుతోనా। యోధనమునకైనదంతయును నింతకుమున్
సాధించియుంచినాఁడవు। మేధానిధి యనఁగనీవ మెలఁగుదుసుమ్మీ.

వ. అని మఱియుఁ దకుఁ-నుంగల సమాఘాత సంభారంబుల సమకట్టి
ధర్మనాథునిపైఁ గోల్తలసేయంగడంగు మేనునుంబయనంబయ్యేదనని,
“సౌందర్యంబు మున్నవిన్నవాఁడకాన గుణమణీదర్శనలాలసుండై, ప
లికిననమాత్యుండెల్ల సామంతులంగని,మీరు మీమీదళంబులతో నెల్లిప
యనంబై రావలయు సర్వంబు సంపన్నంబుగావలయునని చెప్పి, పే
రోలగంబుననున్న నెల్లరనంపిపుచ్చి, రాజానుమతింగొని, గృహంబజే
గి, మరునాఁడు రెండులక్షల పదునెనిమిదివేల యేడువందల మతం

గజంబులును, గజసంఖ్యానెసంగు మహారథంబులును,నుమ్మడుంగులధి
కంబగు నాజానేయాశ్వంబులు, నైదుమడుంగులు పెచ్చుపెఱుఁగుకా
ల్బలంబులును, గలిగిమూఁగిన దశాక్షౌహిణీ సైన్యంబునకు సర్వవ్యూ
హరచనాధురంధరు నొక్కనిం దళవాయింజేసి, భేరిమ్రోగించె. అ
ప్పుడు మహాబలుండు సర్వసేనాసమేతుండై బయలువెడలి, యెడనెడ
విడిదలంజేయుచుఁ గతిపయప్రయాణంబులఁ గనకగిరి పురీపరిసరంబు
నకఱుదెంచి, ముట్టడించె. అంతకును న్నదియంతయునువిని,యుద్ధస
న్నద్ధుఁడై యున్నధర్మనాథుని కడకపుడొకరాయబారివచ్చి, మహాబ
లునివాక్యంబులుగానిట్లనియె. ౨౨౨

చ. కలనసమస్త శత్రువులఁ గన్మొదలించెడు నంతలోననే
గెలిచి మహాబలుండనఁగఁ గీర్తినిఁబొందిన బల్లిదుండనీ
వలనను గప్పముల్గొనినవాఁడ, మదీయవిపక్షులెల్లరుం
బిలువఁగఁబేరులేకపృథివింజెడిపోవుట విందువేకదా! ౨౨౩

తే. సిరియు రాజ్యంబు సేనలు చిదిసిపోఁగ
వట్టిజగడంబు మాతోడఁబెట్టి కొనక
ప్రతిసమంబును నీవిచ్చుబడినికప్ప
మిచ్చిమమ్మాశ్రయింపుమీ! వచ్చియిపుడు. ౨౨౪

స్రగ్ధ. అట్లేకాకీవుమాతో నరిది మొనయఁగా నాయితంబైతివే ని
క్కల్లా నీకేమిదే నీకటకమున కనీకంబుతో వత్తుమా ని
ప్పట్లన్ఫీరోవ్వకనిల్మి వలఁతివయిమహా ప్రాభవంబొప్పనాలం
బెల్లై యెట్లుండునోనీవెటులుచిదియుదో యెట్లునుంబోట్లుఁదాఁకన్

క. కనుఁగానవు నసునధిపతి! ననిచూఁడవు సుంకమంప వపరాధివిఁకన్
నిను జమునియింటికతిథిగ! నొనరించెదనువ్వోయింతయు కెఱక్కిన దే.

వ. అనిపలికినధర్మనాథుండుసటాసముత్పాటనామర్షితహర్యక్షాధ్యక్షునిం
బోలికనలి నిటలతటఘటితకుటిలభ్రూకుటియై వానికిట్లనియె. ౨౨౭

క. ఘన్నమెుకని తాతసామ్రా। పాయకమున్నెంతమంది పాలింపరో కో?
నాయంతవాఁడ నేనా। హా! యతఁడు దనంతవాఁడునరునిడనే లా?

ఆ. అరియు గిరియు నొసఁగియాశ్రయింపఁగరాఁడు
ధర్మనాథుఁడాజితత్పరుండు
దళము తనకుఁజాలఁ గలుగునంచునువిఱ్ఱ
వీఁగుదానినెల్లివీఁగజేయు. ౨౨౯.

క. నన్నరసిబ్రతుకుమనుకా। కున్నందానన్నజమునియొద్దనివాసం
బెన్నఁడువీఁగకయుండఁగఁగ్రన్ననఁనేఁడెల్లితనకుఁగలిగెడుననుమీ. ౨౩౦

వ. అనిపౌరుషంబునంబలికి దూతనంపి పుచ్చిచతురంగసేనలంగూడి సమరంబునకుం జనువాఁడైయున్న వృత్తాంతంబువిని తత్తరంబునొంది వచ్చిగుణమణి ప్రాణనాథుని పాదారవిందంబులకుం బ్రణమిల్లివినయంబున నిట్లనిప్రార్థించె. ౨౩౧.

ఆ. ప్రాణనాథ, నాదుప్రార్థనమంగీక। రించిచనువొసంగనెంచినన్ను
దాసురాలిఁగరుణదైవారరక్షింపు। మెన్నితప్పులున్న యేనిసైఁచి. ౨౩౨

తే. నేలఁబోవుదానినినెత్తినిల్పుకొనక
కలియొ గఁజియొ త్రావియెవ్వలనరవ్వ
రట్టులేకకలిగినంతవట్టుమనకు
గోడిగాఁగాలముఁ గడపఁగూడదకట! ౨౩౩.

తే. వంగవిషయాధినాథుఁ డవార్యశౌర్య
ధుర్యుఁడబ్ధి గాంభీర్యుఁ డహార్యధైర్యుఁ
డింతనంతలరిత్తవోయెడు వెడంగు
గాఁడు ముక్కాకలనుదీరెఁగండుమగఁడు. ౨౩౪,

తే. సర్వసేనాసమేతుఁడై సమరమునకుఁ
గాలుఁద్రవ్వుచుఁ జనుదెంచి ప్రోలుఁజుట్టి
ముట్టడించి మగంటిమిఁబట్టిమనల
నైదుపదిచేయఁగానుండెనంచువింటి. ౨౩౫.

చ. అతఁడు మహాబలుండు ప్రళయప్రబలాతిచలన్మహాబల
ప్రతిముడు వాని కఱ్ఱెదుర వైరులు తూలములట్టు లుర్వినన్
స్థితిచెడిమీదిమార్గమునుఁ జేరెదరెంతయునట్టివానితోఁ
బ్రతిఘటియింపగా మనకుఁబంతమునిల్చునె? జీవితేశ్వరా. ౨౩౬

ఆ. అరయమునకువచ్చు నతిశయంబేమివ్వ
తోంటియట్లు వానితోడమైత్రిఁ
బరపికరము లొగ్గి కరముఁగర మొసంగి
నిమ్మళమున నుంటనీతి కాదె. ౨౩౭

వ. అనిదీనవదనయై వగచుచున్న మగువంజూచి మగండిట్లనియె. ౨౩౮

క. అబలా,చింతిల నేటికి। సబలుండైవచ్చెనేనిశత్రునిఁగడిమిన్
గబళింతుఁగానిదీనత। గుబురునఁజనివానిఁజేరఁగోర నిజముగన్. ౨౩౯

క. శ్రీరఘురామునికరుణా। సారమునన్ రామలింగ శశ్వత్పూజా
గౌరవమున నేరాజులఁ। జీరికిఁగొనఁ జేరివాని సేవింతునటే. ౨౪౦

వ. నీవు స్త్రీచాపలంబునం జేసివెగడు పడుచుంటి వుడుగు మొక్కనిమే
షంబుననమ్మహాబలునిందెగటార్చి వచ్చినీకుసంతసంబుఁగావింతున
నియంపిపుచ్చి, తానంగరాగ మాల్యాంబరాద్యలంకారాలంకృతుం
డై సహస్రభానురథప్రతిమానానూనప్రభాభాసమానంబగు నొకరు
మహారథంబునందధిష్ఠించి, సర్వసేనాసహితుండై సంగ్రామరంగం
బునకు మంగళవాదిత్రపూర్వంబుగాఁజనియె నప్పుడుభయసైన్యంబు
లుభయస్థైర్యంబునఁ బూర్వాపర పారావారంబులంబోలి తాకిన
ట్టియవసరంబున, ౨౪౧

సీ. గంధదంతావళ గర్జితంబులు,నశ్వహేషితంబులురథ ఘోషములునుఁ
బటుగుణటంకృతి చటులశబ్దంబులు, ఖడ్గఘట్టనము, లఖండకింకి।
ణీనిక్వణంబు, లహీనఘంటానినాదంబులు, శంఖనాదములు, సింహ
నాదములు భేర్యాదివాదనంబులుబాణపాతధ్వనులుతూర్యవాశితములు

బిరుదవాక్యారవంబులుపరిపరివిధదుష్ప్రలాపరుతంబులఁ తోడుగూడి
పెద్దకోలాహలమ్మయి పెటిల్లనింగి। నేలయునుబద్దలుగఁజేయులీలనుండె

వ. ఆసమయంబున ౨౪౩

చ. అరములు చక్రముల్విఱుఁగనట్టియిలంబడినుగ్గునూచమౌ
నరదములు న్గణంబులగు నంగములుఁగల ఘోటకంబులున్
శిరములుఁ గాళ్ళుఁజేతులునుఁ జెక్కలుముక్కలుగాఁగఁ ద్రుంగినన్
ధరఁగయిసేయుసారథులుఁదారునుఁగా రథికుల్కడుఁబోరిరుద్ధతిన్ ॥ ౨౪౪

తే. భిదురమునఁ గూలుకొండల పిండువోలె
తుండములు గండములు గాళ్ళుఁ దునుకలగుట
భూరిదంతులు తెగిపడిభూమిఁగప్పె
హస్తిపకులొండొరులుఁబోరు నవసరమున. ౨౪౫

క. ఉరుహేషలగురుధారలఁ। బరువళ్ళంద్రొక్కుతురగపంక్తులపుడు పెం
పరికుప్పఁగూలెవినమే। ధరలోనత్యుచ్ఛ్రయఃపతనహేతువనన్. ౨౪౬

క. పిషగులపిల్లలొక్కోయనఁ। గడిమింబగవారియందుఁగనఁబరిచివడిన్
గడుఁబోరిపోరిచచ్చిరి। పుడమింబడిపెక్కుబటులుపాడిపాడియగుచున్.

చ. తెగువ నొగల్వ్రెగ్గలిపి తేరిపయింబడి శత్రుఁబట్టువా
రొగి రథచోదకుండు వడనొయ్యనఁదామరదంబుఁదోలుచుం
బగర బడల్పడన్పలుపువారునుఁ దేర్చెడ వాలుఁబల్కులన్
దిగికొని నుగ్గునూచముగ ద్వేషులఁజేసెడువారునైరటన్ ౨౪౮.

చ. ఒకఁడొకఁ డంటిమ్రుదునవి, యొక్కఁడ యొక్కనిఁ జెక్కుమందివీఁ
గక పడియించునట్టియవి, కత్తిళము ల్పడగ ల్ధనుస్సులున్।
మొకములబూరగొమ్ములును ముక్కలు ముక్కలు గానొనర్చి యె
న్నికఁగనునట్టి వైయలరెసకొక్కని బాణముల్దళంబులన్ ౨౪౯

వ. ఇట్లిరువాఁగునుంగదిసి తోమరభిండివాలపరశు పట్టస ముసల ము
ద్గరగదాసికుంత కరవాలాదిసాధనంబుల నొక్కపెట్టుసంజుట్టుముట్టి
తెట్టెలుగట్టునట్టు కొట్టికొనుచుఁ, గేకలనేకంబులు నాకంబుముట్టనట్ట

హాసంబులు బిట్టపరసర్వాంగంబులును దిలప్రాయంబులుగా నసాధారణవిక్రమక్రమంబునం బోరినపోరు ఘోరంబయ్యె. అయ్యెడం గేశశైవాలంబులును, ముఖపద్మంబులును, నేత్రమీనంబులును, ప్రపదకచ్ఛపంబులును, గంధరాశంఖంబులును, నఖరరత్నంబులును, కీలాలకీలాలంబును, గలిగి సంగ్రామరంగంబు గంగాప్రవాహంబు పగిదిరథహస్తిపత్తితురగాదిదారువుల మోచికొని ప్రవహించెనట్టియవసరంబున.

చ. అలిగి మహాబలుండు ప్రళయాంతకునట్టిడయైకరంబులన్
బలుకయువాలునుం గొనిజవంబున వైరుల నెల్లనూచకో
తలుగను గోసికోసి బలదర్పముజూపిన ధర్మనాథుమూ
కలు వెరగందెఁగుందె గడుఁగందెనుడెందెనుభ్రమందెనెంతయున్

వ. ఇట్లవక్రవిక్రముండగు మహాబలుని బలపరాక్రమంబున మల్లెవట్టినచేనుంబలెఁగానరాక నిజసైన్యంబుదైన్యంబు నొంది, భ్రమందుచుంటఁ గని ధర్మనాథుండు గల్పానల్పగభీరభైరవుండై గండుమిగిలి దోర్దండచండిమంబుఁజూఁపుచు శాత్రవునిదిక్కునఁ గరదంబుఁదోలించి తూలించుటయునతండును రథాధిరోహణంబుచేసి మాటొడ్డియస్త్రంబులకుఁ బ్రత్యస్త్రంబులేయుచుఁబోరుచుండునపుడు ధర్మనాథుండు॥ ౨౪౨.

మ. నియతిన్ స్వాంటసమంత్రకంబుగననాగ్నేయాస్త్రసంధానమెంతయుఁగావించి పరాక్రమంబున వడిన్ బ్రత్యర్థిపైనేసిభూ
దయితా, వచ్చెదుకాచికొమ్మనుచు నాద్ధత్యంబుమైగహ్వారీ
పీయదాశాస్త్రంబులెల్లఁభేదిలఁగడుంబెల్లాత్సెనొక్కుమ్మడిన్ ౨౪౩.

వ. అపుడు మహాబలుని సైన్యంబుదైన్యంబు నొందుటయునతండును. ౨౪౪

మ. వెఱకుం డేఁగలనంచు భూమిపతివేవేవచ్చునచ్చిచ్చుటం
పఱధైర్యంబున వారుణాస్త్రమునఁదావారించి పైఁ బెద్దపాఁ
తఱలైవచ్చెడుభూవరాస్త్రములుత్రప్పత్యస్త్రముల్వైచియే
డ్తెఱసంహార మొనర్చి తో౯లెనరులన్దేవౌఘుమగ్గింపఁగన్ ౨౪౫.

శా. ఛండప్రక్రియ నట్లు దోర్బలలసచ్ఛౌర్యంబవార్యంబుగా
దండుం దూలఁగఁజేయుచున్నృపతి కోదండోగ్రమౌర్వీరవో
ద్దండారావమునం జెసల్పదియు నత్యంతంబు మాఱ్మ్రోయ ను
గ్రుండోనా నెటఁజూడఁడానయగుచుంగోరాడిపోరాడుచుఙ్. ౨౫౯.

ఆ. ధర్మనాథుఁ జాపధర్మహీనుఁగ నస్త్ర। శస్త్రహీనుఁగాఁగ శక్తిహీను
గాఁగ రథవిహీనుఁగా సైన్యహీనుఁగాఁ। జేసి వాసిమీఱఁజెఱఁబట్టె.

వ. ఇట్లు పట్టి కారాగారంబునఁబెట్టఁ దనయూఱికంపిపుచ్చి చచ్చెనని యె
ల్లెడఁదెల్లంబుగాఁ జాటంబుచ్చె నంత హతశేషులు యథాయథలై చె
ట్టాకఁడు వట్టి రట్టియెడ శృంగారవతింబరసతిఁ దనవశంబుఁ జేసికొ
నందలంచి జాణయగు నొక్కదూతిక నంతఃపురంబున కనుపుటయు
నదియుఁజని గుణమణింగాంచి సకపటంబుగా నిట్లనియె. ౨౬౧.

చ. అకటకటా! సతీతిలకమా, యిపుడేమని విన్నవింతు వా
కొకయిసుమంతరాదు మదియుత్తలపాటును జెందు బాష్పకం
టకములునిండి గ్రుచ్చుకొనుటం గనుదోయి గనుంగొనంగఁజా
లక చెడు లోమహర్షముఁ జలాచలకాయమునుం గనంబడుఙ్. ౨౬౨.

చ. మతిచెడి యున్నదాన నొకమాటకు వేఱొకమాటవచ్చు సం
గతిచెడె నీమగండు రణకౌశలమొప్పగ శత్రుభూమిభృ
త్పృతన బడల్పడన్నలిపి విక్రమసింహు మహాబలావనీ
పతినెదిరించి కాలగతిపాలయి పోయెనిఁకేమిచెప్పుదుఙ్. ౨౬౩.

చ. అనవిని గుండె జల్లుమన నప్డువడిందెగ వ్రేయునంటి ప్రమాఁ
కనఁగ గుభిల్లునంబుడమియందు సతీతిలకంబు వ్రాలి మే
ననుసుఱిదెకఁడే మెలఁగనా? విడిపోయెన? నాఁగసందియం
బును గలిగించునట్టి కడుమూర్ఛమునింగి కలంగె నెంతయుఙ్. ౨౬౪.

వ. ఇట్లు పెద్దసెద్దురంజెందినట్లు మూర్ఛంబొంది సఖీజనాశ్వాసితయై పె
ద్దయుంబ్రొద్దునకొక్కించుక తెప్పిఱియప్పరమపతివ్రతావతంసంబు
రస్తాడనంబుచేసికొనుచు నెలుంగు రాలుపడ నుచ్చస్వరంబున హాహా
మనియేడ్చుచుండునప్పుడు. ౨౬౫.

ఉ. కోకిలగ్రోల్చినట్లడలు కోమలికొల్కులఁ జాలునీరు కు
ల్యాకృతిఁదాల్చి,యాచిబుకమందున నైక్యమునొంది, రంహముం
గైకొని, వక్షమందుఁబడి, గాటముగాఁబ్రవహించి, పోయి వి
న్నాక తెలుంగునం ధర కవారిగఁజేత నపూర్వవైఖరిన్. ౨౬౬.

వ. అంతనొకింత వడికిఁ బ్రాణనాథునుద్దేశించి. ౨౬౭.

సీ. హా! నాథ,హా! నాథ, హా!జీవితేశ్వర, ననుఁబాసిపోయితే! నాకమునకు
నేకపత్నీవ్రత మేదినన్గాదని తగునె? హా! మోక్షకాంతను గ్రహింప
నాబహిఃప్రాణమా,నన్విడనాడిపోనెట్లుకాళ్ళాడెనో యెఱుఁగఁజెప్పుము
నినుఁబాసియేనొక్క నిమిషమాత్రంబైన నెమ్మెఁ బ్రాణముల్నిలుపఁజాల
నీవులేకున్న సర్వమిదేల? నాకు
నధిప,నీతోడిలోకమ యగునుగాని
భ్రూణహత్యాఘముపొసంగుఁబోయటంచు
లోన వగతు నంతర్వత్నిఁగాన నేను. ౨౬౮

చ. తులువమహాబలుం డతనితోడివిరోధము కూడదన్న నా
పలుకులు వమ్ముచేసి కడుభారముఁబూని దురంబొనర్పఁగాఁ
దలకొనిపోయి శాత్రవులదారుణశస్త్రముఖానలంబులో
పలఁబడి ప్రగ్గితే? హృదయవల్లభ, యింకిటనేమిచేయుదున్. ౨౬౯.

వ. అనియనేకవిధంబుల మనోవ్యథలంబొరలుచున్న సమయంబున దుః
ఖోపశమనంబు సేయుదానివలె నొదార్చుచునాదూతిక యిట్లనియె

క. చచ్చినవారికివగవ। న్వచ్చునె? యిపుడింత వెఱ్ఱిపట్టిన దేలా?
ముచ్చటదీఱదటంటివ? యిచ్చమహాబలునిఁగూడి యెసగఁగరాదే.

తే. ఆమహాబలునైశ్వర్యమదివచింపఁ। దలమెరాజుల నెల్లగెలిచియధిపుఁ
డై తలిర్చెడునాతనినంటితేని। గారవించెడునందఱికన్ననిన్ను. ౨౭౦.

వ. అనాథవైకూడుగుడ్డలకిడుమఁగుడుచుచు మువ్వమగు జవ్వనంబువమ్ము
సేయకనాచెప్పినచొప్పునం జేసితివయేని సుఖముపడఁగలవట్లు చేయు

మనినం జెవులుసూడినన్లైనం జేతులమూసికొని హరస్మరణంబుచే
యుచు దానింజూచి. ౨౭౩.

చ. హరహర యిట్టిపాతకము లాడఁగఁజెల్లునెనీకు నిద్ధరం
బరమ పతివ్రతామణులఁబల్కిన పాతకమింతనంతయే?
తొరగునె వాలుఁగంటులకుఁదోడును నీడ యనుంగుఁజుట్ట మీ
శ్వరుఁడును భర్తయానతఁడువాసిన యే నొరునంటఁబోలునే. ౨౭౪

వ. నీదుప్రవర్తనం బంతయుం దెలియవచ్చె నీదురాలాపంబులుచాలిం
చి నీవు నీదారింబొమ్మనిన జంకించుచు నదియిట్లనియె. ౨౭౫.

ఆ. నాదుబుద్ధివిన్నమీఁదమిక్కిలిసుఖ। యింతువట్లుకాదయేనినిన్ను
బలిమినైనఁజెఱఁ బట్టిమహాబలుఁ। డింతలోనఁజెఱుచు నిదినిజంబు.

వ. అనిన నగ్గుణమణి యామహాబలుండెంతకైనంజాలువాఁడని యింతిం
తనరాని చింతయంతయు నంతరంగంబునం దడంచుకొని,దానిఁదప్పిం
చుకొనునుపాయంబుచింతించి దానికిట్లనియె. ౨౭౭.

క. నీమాటకుఁబ్రతికూలం। బీమెయినొకింతపలుకనెంచితిఁగాఁకీ
భూమి సుఖించుటకన్న మ । రేమున్నదిమేననసువులేఁనయవలక్.

వ. నావినోదవాక్యంబులకు గర్హింపకుము, మాయింటి యాచారంబునంజే
సి నేఁడు నాకొక్కవ్రత ప్రతిబంధంబు గలదు కావున నేఁటికింబోయి
రమ్మెల్లి నీయిచ్చవచ్చినట్లు మెలంగుదు నని మీదొరకుం జెప్పుమని కొ
న్ని సొమ్ములు కానుకలిచ్చి, బుజ్జగించి, పుచ్చి, వెనుకతనమనంబున ని
ట్లని వితర్కించె. ౨౭౯.

ఉ. ఏమియుపాయ మిప్డు హృదయేశునితో మృతిఁగాంతునంటినా
నామెయిదాహ్వదాంకము గనంబడుఁ గావున భ్రూణహత్యయా
నేమయినన్న రేఁవెతసహింపుచునింటన చాఁకయుంటినా?
యీమెయిదుష్టుఁడాన్పతియేమియొనర్పకయుండునయ్యయో.

తే. కుందుచును ముందుఁబోయిన గొయ్యి వెనుకఁ
బోయినను నుయ్యి యనుసామ్యమునునిజంబ

నైయెసఁగినట్టులుంటి నే నాయవస్థ
కేమిచేయుదు? నెటుఁజొత్తు? నేదిదికురా? ౨౮౧.

తే. గోరుచుట్టుపై రోఁకలి చేరినట్లు మూలిగెడునక్క మీఁదను దాళఫలము
పడినయట్లిప్డు పతిపోవఁ బాట్లుపడెదు। నాకు దుష్టుని రాయిడి తాఁకెనకట.

వ. అని మిగుల వగలం బొగులుచు, నమ్మగువ మానంబుఁ గాఁచికొనందగిన తెఱంగరసి, చారుమతియను నొక్కదాదిం బిలిచి తదుదంతంబంతయు నెఱింగించి, యేయుపాయంబుననైనం బాపకర్ముల బారింబడక తప్పించుకొని కన్నవారియింటికిఁ బోవలయునని దానిం గూడి, ప్రచ్ఛన్నవేషంబు వైచికొని, కట్టికచీఁకటిఁ గన్నునుం గాలునుం గానరానియద్దమరేయిఁ గావలివారలఁ గనుఁబ్రామి పురంబు విడిచి పోయె. అంతమఱునాఁ డరుణోదయంబునఁ దొంటిదూతిక వచ్చి, నగరున రాజపత్ని లేకుంట మహాబలున కెఱింగించుటయు నతండునుం జిచ్చువలె నంతఃపురంబు సొచ్చి, యగ్గలువట్టి నలుగడలు వెదకివెదకి ఖండితాశాపాశుండై రోసంబున నుదయసీయానంతరంబున ఋత్విజులు సర్వతోముఖ మఖశాలలం బలె నగరంతయు రగుల్కొల్పించి, సపరివారంబుగాఁ దనదేశంబునకు నిర్గమించె నంతనక్కడ. ౨౮౩.

చ. గుణమణి తాను నెచ్చెలియు ఘోరతమఃపదమౌ కుహూతమిన్
క్షణమెడ యీఁక అంకెలిడి కాండ్రను బెబ్బులులున్ భయంకరాం
గణమగు కాననంబునను గట్టులుఁ బుట్టలు నేళ్ళుఁ బోళ్ళునుం
ద్రిణయను భక్తి సాయమయి నిల్వఁగ నిల్వన దాఁటిపోవుచున్. ౨౮౪.

వ. నిరాహారంబులులేక కతిపయదినంబులు సంతతప్రయాణంబు సేసి, యొకకొ మహారణ్యంబున సాయంసమయంబగుటయు మార్గాయాసంబడర నడఁ జాల కటనున్న గౌతమియొడ్డునం బడి యొడలెఱుంగక నిద్రించుచుండిరి. ౨౮౫.

శా. ఆవేళం గడుదూరశైలమున వర్షారంభమై యింతలో
ద్యావాపృథ్వ్యవకాశమింతయును లేదన్నట్టులుప్పొంగి, యా

క్రేవ న్వెల్లువ వచ్చి, యెల్లకడల నీభమంబుగాముంచి, పా
రావారంబును జేసె, నొక్కగడెలో బ్రారబ్ధకర్మంబునన్. ౧౮౬.

క. ఆయుప్పెనలోఁ బడికాం। తాయుగ్మము కొట్టుకొంచుదారువిధమునన్
బోయెనువిధిబల మెడమై। పోయిన జనులిట్టిపాట్లు పొందెదరకటా !

వ. అకాలవర్షంబునం బొంగిన నగ్గంగంబడి, కొట్టుకొని పోవునప్పుడు దైవవశంబునం జేసి చారుమతి దరిఁజేరి, పోనున్న తనప్రాణంబులు నిలువరించుకొని, యటనున్నముని పల్లెకేగి, గ్రాసవాసోదైన్యంబుఁ దీర్చికొని, చెంతనున్న పుష్పగిరి పురమ్మునకుఁ బయనమైపోయి, రాజమార్గంబు దరియంజేరిన నెల్లరుం దాని మున్నెఱింగిన వారుకాన వెఱఁగంది చూఁచుచుం దత్పురాధినాథునకు వివేకనిధికిఁ జారుమతియొక్కతియ వచ్చుచుండెనని విన్నవించుటయు నతండుభయభ్రాంతచిత్తుండై తత్తరంపడుచుండ దరియంజేఱి దుఃఖాకారంబునం గనుపట్టు దానిం జూఁచి భయంబున రాజిట్లనియె. ౧౮౮.

క. ఏమే!చారుమతీ, నీ। వీమెయి నొకతె వచ్చి తెల్లరుసుఖులై
తాముండిరె? మనవారిపు। డే మీదుఃఖంబు తెల్పవే! భయ మొదవున్.

వ. అనిననాదాదియుం గంటికింగడవెడు నీళ్ళుగావలవల వలపోయుచు మహాబలుండు దాడివచ్చి ధర్మనాథుని మఱియొక్క లోకంబునకుం బుచ్చుటయు, గుణమణిం గవయఁగోరుటయుఁ, దమ ప్రయాణంబును, గంగాప్రవేశంబును, తానుముని పల్లెకడ గట్టుపట్టుటయు, లోనగు నంతయు నాను పూర్విగా నెఱింగించి, గుణమణిపోయిన జాడనే నెఱుంగ ననిన నెల్లరునుం గొల్లుమని యేడ్వసాఁగిరి. అదివిని రాజపత్ని పద్మిని చనుదెంచి, గుండెలవియ మోదికొనుచు దాదిం గట్టికొని పట్టిన ద్దేశించి.

శా. తల్లీ,బీదకునాకు బిడ్డవగుచున్ ధాత్రింజనింబొందుటన్
జెల్లా! యెట్టివిపత్తులం బడితివో? నిన్నెట్లు వాఁడాఁడునో?
వెల్లిన్ముల్గుచుఁ దేలుచుండుతఱి నే ప్రేమంబునం దండ్రినిం
దల్లిందల్తువొ? యెట్టులుందువొ! యెటందబ్బిబ్బినుం జెందుదో? ౧౯౦.

క. కన్నులనెన్నటికైన। న్నిన్నుంజూఁచెదనొ? చూఁడనేచూఁడనొ? నా
కన్నెరొ,విధియెటువ్రాసెనొ? యెన్నంగానాదుభాగ్యమెట్లున్నదియో?
వ. అనంతరంబ దుఃఖాక్రాంతచిత్తుండగు నృపసత్తముండు తదన్వేషణా
ర్థమెల్లభూములకుం దూతలం బుచ్చె నంతనటనగ్గుణమణియు. ౫౩.
మ. ధునిలోమున్గిపరంబుఁజేకొనకతోడ్తోడన్విధి ప్రేరణం
బుననాసానుగఁగట్టెఁబట్టి కొనుచుం బోఁబోఁగ నొక్కింతలో
దనపా మొక్కఁడు ముల్గితేలిచనుచుం బ్రాణావశిష్టత్వముం
గొనిపెల్లార్చుచుఁ దారసిల్లెను గనుంగొన్నంగడుం గోడుగన్. ౫౪.
క. తనప్రాణనాథునెమ్మన।మునఁదలఁచుచుఁదనకుఁ బాటుపాసఁగిననాఁగా
కనుచున్ననాసతీమణి। కనుగొనిపెనుఁబాముఁజెంతఁగడుదుఃఖమునన్.
క. అయ్యో! వెల్లువలోనుసు।రియ్యెడఁగలుపంగనున్న యీ ప్రాఁచుననుం
గాయ్యయని తలఁచిఁతలఁకక।చయ్యననిష్టాశ్రయింపఁజనుదెంచుఁగటా!
వ. నన్నిదికఱచునదియైన నాశ్రితరక్షణం బవశ్యకర్తవ్యం బీప్రాణభీరు
వునకు నాశరీరం బాశ్రయణీయంబు గావింతుం గాతమని తలంచి
తలంకకకేలుఁదయిచ్చె నా సరీసృపంబునమ్మార్గంబునవచ్చి, కంఠం
బుఁజుట్టుఁ బెట్టుకొని ప్రాణంబులు దక్కించుకొనియె. అప్పుడాగుణమణి
యింతయును భయంబు నొందక దైవముపై భారమువైచి కొట్టుకొ
నిపోవుచుండె. అప్పుడు కోటిఫలిపురికడనౌకాయాత్రాపరులు నావికు
లామెంగని, కనికరంబునంజని పట్టికొనియొడ్డునకుం దెచ్చిరంతలో నా
గు విడి, యెటయేనియు నేగె. ఆయమ్మయు నాహార నిద్రాదులులేక ప్ర
వాహంబునం ప్రాణావశిష్టయై యున్నయదికాన వాకు లేకపడియున్న
నరహరియనునొక వృద్ధబ్రాహ్మణ పుంగవుండు వచ్చి, యాగుర్విణిం గ
రంబులం బెట్టికొని, తన గృహంబునకుంగొనిపోయి, యుచితోపచారం
బుల సేదఁదేర్చి, యమ్మా, నీవెవ్వరి వెల్లువ నెవ్విధంబునం బడితివి, అని
తదుదంతం బంతయు నెఱింగి కుమారీగౌరవంబునంగని, పోషించుచుం
డె. ఆమెయుఁ దనదురదృష్టంబునకు మిగులవగలంబొగులుచుఁగులదై

వంబగు రామలింగేశ్వరుండ దిక్కనుచు నొకరు మొగి దేహయాత్ర నడపుకొనుచుండె. అంతఁగొంతకాలంబునకటకు సోమేశ్వర దర్శనంబునకై పుష్పగిరినుండి కొందరు భూసురోత్తములుచనుదెంచి, సర్వశుభలక్షణలక్షితయగు గుణమణింగని శుభచిహ్నంబుల నిజరాజపుత్రిక గా నెఱింగికంటఁ దడివెట్టుచుఁ దమ్మెత్తింగించి యయ్యమ్మకిట్లనిరి. ౨౯౭.

క. అమ్మా, గుణమణి, నీకిపు। డిమ్మాడిక్కుర్దరవస్థవచ్చియిట్లయితివెకనీ
వమ్మయిమున్నిటంబడి। వమ్మెన్నపోఁకెట్లుబ్రతికివచ్చితివమ్మా. ౨౯౮.

వ. అనినవామ గోలుగోలుమని కంటికినిమంటికి నేకధారగ నేడ్చుచుఁదన కతయంతయును విన్నవించి కన్నవారుసుఖంబున్నవారేయనిన వారునుం జారుమతి చేరినతీరును, వారిదుఃఖంబును, దన్నురోయఁజారులంబుచ్చినవార్తయుం దెలిపిన నామెయు జన్మభూమింజూఁచునదియై నరహరి యనుమతంబునఁ జతురంత యానంబునెక్కికొని, బ్రాహ్మణపరివృతయై పుష్పగిరికిఁబోయి, బంధుజనంబులం గూడియు, పీడనిపరిదేవనంబునఁగాలంబు గడపుచుండె. ౨౯౯.

మ. అచటన్మాత్రవపట్టణంబునను గారాగారవాసంబునఁ
బ్రచురార్తింబడు ధర్మనాథుఁడు నిజప్రాణేశ్వరీ ముఖ్యబం
ధుచయం బావరణంబునం, దనలమందున్ మగ్గిందిరంచెంచి శు
ద్ధాచలన్మానసుఁ డయ్యుశంకరుని భక్తిన్వేడ దెల్లప్పుడున్. 300.

తే. ఆలిమాటలు వినమి నిట్లయ్యెననుచు
నసికొనునుగాని యంతలోఁదనదుపూర్వ
కృతఫలంబిది కాని వేఱేమికాదు
రాదువగవంగ నంచు విరక్తుఁడగును. ౩౦౧.

వ. ఇట్లువిరక్తుండును నిష్కాముండునై దురిత క్షయమూలంబుగాఁ బరమేశ్వరప్రీతింజేయఁదలంచి, తనమనంబంతయు కనకగిరివాసుండగు రామేశునియందు లీనంబుచేసి యిట్లనిప్రార్థించె. ౩౦౨.

శా. భవసింధుప్లవ, పార్వతీధవ, కవిప్రస్తూయమానోత్సవా
భవ, గోసైంధవ, దేవబాంధవ, నమద్భక్తౌఘపాపాటవీ
దవ, సత్ప్రాభవ, స్నిగ్ధమాధవ, సుధాంధశ్శత్రుసంఘాతభై
రవ, లోకప్రభవా, జితాత్మభవ, సంరక్షించు నన్నోశివా. ౩౦౩.

శా. నీవేతల్లివి, నీవెతండ్రి, వనుజుల్నీవేసుహృద్బాంధవుల్,
ల్నీవేసర్వము, నిన్నెనమ్మితినిలన్నీకంటె నొండొకరుని
న్నేవేడంబడరాని పాటులకునై నీవుండనై వేగిలీ
న్నీవాండంజుమియెట్లు కాంచెదవొ తండ్రీ, భక్తచింతామణీ ౩౦౪.

చ. కదలంగనీకనన్నెపుడుంగామము, క్రోధము, లోభమోహము,
ల్మదమును, మత్సరంబును, గ్రమంబున శాత్రవులట్లుచుట్టుకో
గొందంగొనిదుఃఖవారినిధిఁ గూలితి నెంత సమర్థుండేని ని
య్యదనున నన్నునోమగలండా? శివ, నీవొకరుండుదక్కంగన్. ౩౦౫.

వ. అనిప్రార్థించుచున్నయవసరంబున శ్రీరామ లింగేశ్వరుండంతరంగం
బునంబొడకట్టి, నీకులగ్గుసేయుదునని చెప్పినట్లైన, నతండింతింతనరా
నిభక్తివిశ్వాసంబులభరితుండైయుండెననంతరంబ. ౩౦౬.

చ, అలంతి మహాబలుండొగిఁబరాంగనలంజెఱంబెట్టుచున్మహా
త్ములకపకారమున్గలుగుతో ప్రవలంద్రొక్కుచు, మంత్రినాక్కుల
న్మెలంగకయెల్లసేనలకమిత్రుండపాత్రుండునైవెడంగుచై
వులనొనరింపుచుంటఁ గనిభూజనులందఱును న్విరోధులై. ౩౦౭.

వ. మంత్రుల ప్రోత్సాహంబుసధ్వజంబెత్తివచ్చి, దైవోపహతుండగు నత
నింజుట్టుముట్టి పట్టి, గిట్టింపనొల్లకవిగతవీర్యుంజేసి వెడలంగొట్టి, గౌరీ
నాథపదార్చనారతుండును, శ్రీరామభక్తి భరితాంతరంగుండును, ధ
ర్మావతారుండునగుధర్మ నాథుని నిజదేశాధినాథునిం జేసికొని సేవిం
చుచుండిరతండును. ౩౦౮.

ఉ. రాజ్యముపోయినప్పుడును రాణినిఁబాసినయప్పుడుం బ్రజా
పూజ్యుండునైనయప్పుడును భూరివిపత్తులనందినప్పుడున్

రాజ్యమువచ్చినప్పుడును రాణువలెల్లనుగొల్చినప్పుడున్
బూజ్యుఁడునైన యప్డునొకపోలికనుండె వికారదూరుఁడై. ౩౯౯.

వ. కాంతావిరహితుండగు నాధర్మనాథుండా రాజ్యంబుసేయ నొల్లక, ధర్మప్రభావితుండగు మేధానిధి కాసామ్రాజ్యం బొప్పఁజెప్పి, సకలజనానుమతింబడసి, వేషాంతరంబు సేకరించి కనకగిరికి నఱుదెంచి,రామలింగేశ్వరా రాధనంబు సేయుచుఁ గాలంబుఁ గడపుచుండె నంతనక్కడ. ౩౧౦.

మ. ధవునింబాసినచింతలం జివుకకుండం దైవానుకూల్యంబునన్
నవమాసంబులుసీరుమోసి శుభలగ్నంబందు శ్రీధర్మనా
థవధూరత్నముగాంచెఁబుత్రు, శతపత్రప్రోజ్వలన్నేత్రునిన్,
నవసూనాస్త్రమనోజ్ఞగాత్రుని,గవీంద్రస్తోత్ర సత్పాత్రునిన్.౩౧౧.

వ. అంతట వివేకనిధి దౌహిత్రునకు శాస్త్రోక్త క్రమంబున జాతకర్మాది సత్క్రియా కలాపంబుసిర్వర్తించి, రామనాథానుగ్రహంబునం బ్రబలినవాఁడకాన రామనాథుండను పేరువెట్టి, గారవంబునం బెంచుచు శ్రేయోభివృద్ధికనేక పుణ్యవ్రతంబులు సేయించుచు, నొకసమయంబునం గనకగిరీశ్వరు నర్చింప దేవతాప్రతిముల భూదేవతలంబుచ్చె, వారును బంగారుకొండకరిగి, ధర్మనాథుని గోత్రనామంబులతో రామలింగేశ్వరునకు మహాన్యాస పూర్వక శతరుద్రీయాభిషేకాదికంబొనరించి సేవించి, యాలయమంటపాభ్యంతరంబునసద్గోష్ఠిఁ గాలక్షేపంబు సేయుచుండి రపుడట విశ్రమించియున్నసుగుణమణీహృదయేశ్వరుండు తన్నెఱుంగఁజాలని పాఱులఁదన యత్తవారియూరివారకా రాద్ధాంతీకరించి,దృఢనిరుద్ధంబై ప్రవృద్ధింగొను బాష్పసముద్ధతిఁ బ్రసిద్ధవివేకంబున నడంచుకొని ప్రణతుండై వారికిట్లనియె.

మ. ధరణీదేవతలార, మీరలులతాంతగ్రావవాస్తవ్యులు
త్తరులంచుం దెలిసె న్వివేక సిధియుందత్పుత్రియు, న్మిత్రులున్

వరపుత్రుల్గొలువంగసౌఖ్యగరిమన్ వర్తింతురే? వారలే
వసుసం గూఁతురువాయువంతననుతాపంబు న్నివర్తింతురో?. ౩౧౩.

చ. కటకట!మాలదాయ లిడుకారుసెకంబడి రాజపుత్రి హా
పెటపెటఁ బ్రేలివేఁగెనని విన్నఁదలంచిన నెట్టివారికిన్
బొటబొటరాలినేత్రములఁ బుట్టిననీరు ధరిత్రిముంపదే?
పటపటగుండెబద్దలయిపోయదె!దుఃఖభరంబు పెంపునన్ ౩౧౪.

వ. అనుచు ధైర్యంబు నిలుపలేక శోకసంతప్తచిత్తుఁడై వెక్కివెక్కి పొ
క్కుచున్నరనాథుని దిక్కుమొగంబై వెఱంగుపడుచు ద్విజన్ములిట్లనిరి.

ఉ. ఎవ్వరుమీరు? మీయునికియెక్కడ?మానరనాథుఁజెప్పినా
రెవ్విధిమైనెఱుంగుదు? రదేమియొ మీముఖమెంచిచూడ న
చ్చివ్వనుగాలధర్మమును జెందిన ధర్మవిభుండుదోఁచుమీ
కవ్వసుధేశుఁడాత్మజనుఁడా?ప్రియుఁడా?వివరించి తెల్పుడీ. ౩౧౬.

వ. అనిన నతండు తనమిథ్యామృతికి విస్మయంబునొందుచు వారిఁజూచి.

తే. ధర్మపత్నీసమేతుఁడౌ ధర్మనాథుఁ
డుండియుఁ బ్రయోజనములేకయుండెఁగాన
లేనివాఁడనిచెప్పుటలోన గుణము
గలదుచుడీ భూమివిబుధాగ్రగణ్యులార. ౩౧౮.

వ. అనిన వారయ్యా, మీవాక్యంబులు మాకద్భుతంబు గలిగించుచున్నవి
యేమియుంబలుకఁజాలమనుడు నతండును. ౩౧౯.

చ. ఎఱుఁగుడిధర్మనాథుఁడనయే నశీయాలమువట్టు డాలమం
దఱిమి విరోధి నన్గొని నిజాలయమందున నాఁకవెట్టి డ
బ్బఱ మృతిఁ జెందెనంచు నిలఁబల్లఱపులఁడునాత్మెవాఁడు ను
క్కఱిచెడె నిప్పుడందుదొరమై విడివచ్చితి వంతనేనిటన్. ౩౨౦.

వ. అనిమరియుం గొన్ని గుఱుతులెఱిఁగించి నేనీరామలింగేశ్వరునినారా
ధించుచుఁ గాలక్షేపంబు సేయవచ్చి యిన్నింటిననినం బొంగుచు భూసు
రులు స్వస్తి పుణ్యాహవాచనంబుల రాజుఁబొదివి, మాగుణమణి

యెంతపుణ్యంబుచేసినదియో? తానునంతటి విపదంబుధిందాటి, మ్రి
తుఁడైనవాని వెండియుఁజెందినట్లు నిన్నుఁబొందుఁగదా? ఆహా! భవ
తుకుమార జన్మలగ్నంబెంతలగ్గయ్యో? నారా! వివేకనిధి యెంతధన్యుం
డు? బాపురే! మేమెంతపుణ్యాత్ములము నిన్నుఁజూడఁగంటిమని ప్ర
శంసించుచున్నయెడ ధర్మనాథుండు, వినయవిస్మయ సంతోషదుఃఖా
దులు [illegible]బునం బెనంగొననారా! ఔరారా! ఆహా! ఆహాహా! యను
చు నోడలెఱుంగక యుండి, కొంతవడికిం దెలిసియిట్లనియె. ౩౨౧.

క. నాసహధర్మిణిసుఖత। న్వాసిల్లుచుఁగన్నవారి భవనమునందుం
గైసేయుచున్నదియే? నే। జేసినసుకృతంబదేమొ? శివమిటవింటిరె.

వ. అని తదుదంతంబంతయు నెఱింగి పుత్రోత్సవంబొనరించి ధాత్రీసుప
ర్వులకు వేనవేలొసంగి యంపి పుచ్చి తానుదనజీర్ణవరణోద్ధారం బొ
నరించి యెప్పటిరాజ్యానుసంధానంబు సేయుచుండె. ౩౨౩.

ఉ. అత్తఱి జిత్తములొప్పదలనాఁడెడు నద్ధరణీసురోత్తము
లుత్తరఁబుష్పభూధరముదండకునేగి మహీమహేంద్రుతో
నుత్తలపాటుడింది వరమోత్సవమొంది తలిర్పనెల్లరుం
బుత్తడికొంకధర్మపతి పొల్పుటఁదెల్పిరనల్పవాగ్గతిన్. ౩౨౪

వ. అంతసంతోషితాంతరంగుఁడగు వివేకనిధితద్వృత్తాంతంబానుపూర్వి
గా నడిగివిని, వారికవ్వారిగామణి కనకవస్తువాహనాదులొసంగి ప
చితానంతఃపురంబునకుంబోయిమనభాగ్యం బేమనవచ్చు జామాతస
ఖియై కనకగిరినుండెనట! వింటిరే యని యెఱింగించుటయు. ౩౨౫

ఉ. కన్నులగానెవండని నొకానొక లోకముఁజేరెనందురో!
యన్నరనాథుఁడేగొదలనంటక పొల్చనటన్నయంతలో
నెన్నఁడుఁగానిపోని పనులేర్పడనైననెలర్చు వారునాఁ
బెన్నిధిఁగన్నపేదలనఁ బెచ్చుగసంతసమందిరందఱున్. ౩౨౬

తే. అపుడుగుణమణి మేన్వొంగనలరికన్నుఁ
దొవలనానంద బాష్పముల్దొడరరాహు

ముఖవినిర్గత శశిబింబసఖము ముఖము
ముఖమునను జేర్చి చాలుని ముద్దులాడు. 3౨౮.

క. అప్పటిగుణమణి కుతుకము। జెప్పంగావశమె! సకలశివములకిరవై
చొప్పడుమేల్సమకూడిన। యప్పటికిని జగతిఁదనకునట్టిదియగునే?

వ. అంతఁ గొంతకాలంబునకా వివేకనిధి సకుటుంబముగాఁ బయనం
బై తనముద్దుపట్టి వెంటఁబెట్టుకొని కనకగిరికరిగి, తమ్మునదవ్వులనెదురు
కొని, తోడ్కొనిపోయి సంభావించు నల్లునకు సకుమారయగు కు
మారినర్పణంబుచేసి, వీడనివేడుకల[illegible]గూడిమాడి సుఖప్రసంగంబులం
గొన్నినాళ్లుండియథాగతకృతగమనుండయ్యెనంతనజ్ఞాయాపతులును.

మ. [illegible]లకాలంపువియోగ దుఃఖము ల్కుమాకాంతు ప్రసాదంబునన్
దొలఁగింబోమనకంచు కౌతుక మెదందోపంగ వారొండొరు
ల్గలముల్పాలును సంగతంబయిన లీలన్వేడుకం గూడి మి
క్కిలిగారాబమునంగుమారుఁ గనుచుం గ్రీడింతురెల్లప్పుడున్. 330.

క. మునుపటికన్నసుమిక్కిలి। ఘనవైభవమొప్పవారు కనకగిరింబెం
పునసిల్చిరాజ్యమేలుచు। నొనరించి పెక్కధ్వరముల నొప్పిరిసుఖులై.

క. అనవిని సూతునిఁగనియి। ట్లని రామునిరాజులోమహాత్మా, మహాదే
వునికృపఁబొదలిరిగుణమణి। యనుఁగనకగిరీశ్వరుండునుద్వాందలఁపన్.

వ. అట్టినిజభక్తులిట్టియిక్కట్టులంబడ రామేశ్వరుండేల? యుపేక్షించెఁ
జెప్పుమనిన నతండిట్లనియె. 333.

చ. మునివరులార, ప్రాక్తనముఁ బుణ్యముఁ బాపము నిదుఁబొందకే
జనునకుఁదప్పదందు రదిసాఁగకయున్నఁ బరంబు లేదటం
చునుబరమేశ్వరుండు తనచూఁపునఁ బట్టినయేనిభక్తులం
గనఁడుతటస్థుఁడయ్యెఁ బశుఁగాచియుఁగాఁడసమర్థుఁడెందునన్. 33౪.

వ. ఆమహాదేవుండు మహానుభావుండు, భక్తపరాధీనమానసుండు, భగ
వంతుండు, సగుణుండు, సర్వేశ్వరుండు, సర్వజ్ఞుండు, సర్వసమర్థుండు,
సచ్చిదానందమూర్తి, సర్వలోకశరణ్యుండు, సృష్టిస్థితిలయకారణభూ

తుండు, భూతేశ్వరుండు, భువనభర్త, నిర్గుణుండు, నిర్వికారుండు, నిర్వి క
ల్పుండు, నిరీశ్వరుండు, నిర్ద్వంద్వుండు, నిరామయుండు, నిరంజనుండు,
పరంధాముండు, పరమాత్ముండు, పరమేశ్వరుండు, పరాత్పరుండు, ప
రంజ్యోతిస్వరూపుం, డవాఙ్మానసగోచరుం, డప్రమేయుం, డవ్యయుం, డ
ఖిలాండకోటి బ్రహ్మాండనాయకుం, డాదిమధ్యాంత రహితుండు,
హైమవతీసహితుండు, దయామయుం, డతనికిం జాలిన దైవంబొక్కఁ
డును లేఁడ ద్దేవదేవుండు. ౩౩౪.

సీ. తనకొత్తుఁడనక నెత్తని గెలిచెఁగఁ బోదెయగు వరంబిడఁడె భస్మాసురునకు
నుడిగంబు సేయుచు విడక మ్రోసలనిల్తునని వరమ్మిడఁడె బాణాసురునకు
లీలమై మెఱుగ మేర్పు హాలాహలము గ్రోలి యభయంబిడండె సురాసురులకు
గనికరమెట్టిదో కాని కాదనక తా సామే నొసంగఁడే హైమవతికి.
మరియు నెందఱికెన్ని యే వరములిడఁడె
యమ్మహాత్ముఁడు పరమదయాసముద్రుఁ
డఖిలనతభక్తలోక సురావనీజ
మతని వేఁడి పొందఁగరాని యదియుఁగలదె? ౩౩౫.

వ. అని మఱియు నారామేశ్వరుండు ప్రత్యక్ష ప్రమాణదైవంబతని కడంగల
యబ్బురంబులు గొన్ని వివరింతు వినుండని వెండియును. ౩౩౬.

ఉ. దొంగల కెల్లఁ దేఁడగుచుఁ దోఁచిన దొంగయొకండు వచ్చి తా
లింగము క్రిందిసొమ్ముఁ బెకలించి కొనందగునంచు నెంచిలోఁ
బొంగుచు నొక్కరేయిఁ గడు పూనికతో గుడితల్పులూడిపో
వంగఁ బగిల్చి లోనికి జవంబునఁ బోయి బలంబు పెంపునన్. ౩౩౭.

వ. ఒక్క దృఢంబగు నినుప గునపంబు పూని వ్రేయ నవ్వేఁటు లింగంబుపైఁ
బడియటనొక్క శకలంబూడి నేలంబడియె నటనుండి జల్లున నెల్ల స్రవిం
చి యుప్పొంగి మహాప్రవాహంబై తస్కరుని ముంచె వాఁడు నా నెత్తు
రేటంజొత్తిల్లి చొత్తిల్లి కాలధర్మంబు నొందె నంత. ౩౩౮.

మ. పరిపాటింగొలువంగ నర్చకుఁ డటంబ్రాహ్ణాంబునన్వచ్చి నె
త్తురువాగుంగడు భిన్నమైన తలుపుంబొర్లాఁడుచోరు న్నివా
వరలింగచ్యుత ఖండమ్ముంగని మహావ్యగ్రాంత రంగుండునై
పురికింబాఱివచించె, నెల్లరకు దత్పూర్వోత్తరంబంతయున్. ౩౪౦.

వ, అదివిని, పురజనులెల్లరుంజని, యదియంతయునుంగని, యార్యులవలన నాగమోక్తక్రమంబున సంప్రోక్షణాదికంబొనరించి, నాఁడుమహాశివ రాత్రియగుటంజేసి, యతవ్రతంబున నభిషేకంబు సేయుచుండ లింగో ద్భవకాలంబున లింగంబు పెచ్చు రేఁగి, యప్పటియ ట్లొప్పె నంత శాంతులుపఠించి, షోడశోపచారంబులం బూజించి సేవించుచుండిర నంతరంబ. ౩౪౧.

చ. ఘనమహిమాదికంబున జగంబున జాలఁ బొగడ్త కెక్కిరా య
ష్టశివుఁడొప్పుచుండుటయు నంతనొకానొక కాలమందునన్
ఘనమతివీరభద్రుఁడు దనర్గాఁజమశైవుఁడొకండువచ్చి దే
వుని కెదనిల్చి చేసెఁ దపమున్మనులెన్నఁగఁ సత్ఫలార్థియై, ౩౪౨.

తే. మండువేసవిబంచాగ్ని మధ్యనిలిచి । వానకారునవడకిడు బండఁబండి
గొంటరానిసీతునఁదలబంటిమునిఁగి । గాలియును మెక్కి కటతపంబొలిజేసె.

తే. ఇట్టులుత్కృష్టముగఁ దపం బేండ్లుమూఁడు
దీక్షఁజేసిన శివుఁడు ప్రత్యక్షమగుచు
నెదుటఁ బొడసూపకుండిన నెంతయేనిఁ
కోపమును భక్తి మనమునఁ గొనలుసాఁగ. ౩౪౪.

వ. వీరభద్రుండు తననాలుకంగోసి శివునకుం బూజించి. నిద్రాహారంబు లందొఱంగి చలింపక, యేకాగ్రచిత్తుండైయత్యుగ్ర తపంబు గావిం ప శంకరుండు పొడసూపి, వానియభీష్టం బొనఁగూర్చి యంతర్ధానం బునొందె. జిహ్వాకయు నెప్పటియట్లు ప్రకాశించె. అతండును గృత కృత్యుఁడై నిజగృహంబరిగి సుఖంబుండె నిది కనకగిరీశ్వర మహత్వ మని మరియును. ౩౪౫.

క. అలరామేశు మహత్వముఁ
దెలుపఁగ నంతయును బ్రహ్మదేవున కైనం
దలమా? తోఁచినవడువునఁ
దెలిపితిఁ ద్రసరేణువంతఁ దెలియుఁడి మానుల్. ౩౮౬.

చ. కొనలనృసింహమూర్తి గొనకొంచుమహత్త్వముఁ జూఁపుచుండ స
క్కనకగిరిప్రదేశమునఁ గన్గొనఁబొల్చి వెలుంగురామ నా
థునిఁగనిభక్తిఁగొల్చి వినుతుల్పచరించిన వారుసౌఖ్యమిం
దునశతవర్షముల్గుడిచి తోడనయేగి సుఖింతురందునన్. ౩౮౭.

క. అనిశౌనకాదిమునులకు । వినుపించెనుసూతుఁడిట్లువినయముతోడన్
జనులార, దీనిఁజదివిన । వినినవినయమునయము న్వివేకముగలుగున్.

మ. పరగంజేసెనురాణ్మహేంద్రనగ[illegible]వాసుండు, శ్రీవేంకటా
ధ్వరికిన్వేంకటసుబ్బ సామిదమకు న్బాలుండు, శ్రీగౌతమీ
చిరమాహాత్మ్య ముఖప్రబంధకృతి, యా శ్రీపా[illegible]కృష్ణాఖ్యుఁ డిం
బరనేత్రేభ మృగాంకసంఖ్యశక మొప్ప[illegible]ల్చునప్డీకృతిన్. ౩౮౯.

క. తెలిసినవాఁడనటంచుం । బలుకఁడు నేర్చినకొలంది వైళముగా ని
ట్టులువ్రాసినాఁడుతప్పులు । గలిగిన యేదిద్దిబుధులుకరుణింపఁదగున్.

ఆశ్వాసాంతము.

మాలిని. దలితమునిజనార్తీ, ధారుణీచక్రవర్తీ
జ్వలదమలినమూర్తీ, సర్వలోకానువర్తీ
కలితవిపులకీర్తీ, కావ్యకృచ్చిత్తవర్తీ
సులలితగుణపూర్తీ, స్తోత్రకృత్కృష్ణమూర్తీ.

గద్యము. ఇది శ్రీమదఘునాథనోభ[illegible]కవిమిత్ర, వేంకట
యజ్వాగ్రపుత్ర, సమారాధిత విబుధరాజ,
శ్రీపాద కృష్ణమూర్తికవిరాజప్రణీతంబైన
కనకగిరీశ్వర చరిత్రంబునందు సర్వంబు
నేకాశ్వాసము
సమాప్తము.

# ప్రకటన.

---

**కలావతి.** అనునొక తెలుగు మాసపత్రిక, యీసైజు ౪౦ టల పుస్తకముగా ముద్రించి ప్రకటింపఁబోవుచున్నాము. ఇందు శృంగార, ధర్మ, నీతి, బోధకములగు ననేక విషయములు చేర్పఁబడును. దీనికి చందా సం॥ ౧కి రు 3-0-0లు చందాదారులుగాఁ జేరఁదలచినవారు ముందు వ్రాసికొనవలయును. పత్రికం జూచిన తర్వాత సొమ్ము పంపవచ్చును. ఈవిషయమై సంగతులు తెలిసికొనువారు రిప్లై కార్డు పంపవలయును.

ఇట్లు,

శ్రీపాద - కృష్ణమూర్తిశాస్త్రి.

పెద్దాపురము.

గోదావరిజిల్లా.